# సమాలోచన




జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 3 — [illegible] 1-10-1980 — సంచిక 23


—* ఈ సంచికలో *—



16—10—1980 సంచికలో అద్దేపల్లివారి ఋతువిలాసము, ప్రేమచంద్ గోదాన్, కృష్ణశాస్త్రి రచనా శిల్పము, అన్నమయ్య సంకీర్తనలలో శృంగారరసం మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—


చందా

సంవత్సరమునకు రు. 10—00.

అర్ధసంవత్సరమునకు రు. 5—50.

విడిప్రతి 50

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V T J College, Rajahmundry

సంపుటము 8 రాజమహేంద్రవరము 1-10-1980 సంచిక 23


## ప్రబంధ శృంగారములో శిల్ప, చమత్కృతులు


— శ్రీ కందనెల్లి భద్రన్న, ఎం. ఏ.


ప్రకృష్టమైన బంధముకలది ప్రబంధము అని నిర్వచనము మూలకథను విస్తరించి వ్రాయుట, అష్టాదశ వర్ణనలు చేయుట, ఊహాకల్పనము శృంగార రసపోషణము మొదలగునవి ప్రబంధాలలో కన్పట్టును శృంగార రసముపై కవులు ప్రత్యేక దృష్టిని సారించి రసవ్యంజకముగా ప్రబంధాలలో రచన సాగించినారు కట్టమంచి రామలింగారెడ్డి వంటి హేతువాదులు ఈ ప్రబంధ వర్ణనలను ఏవగించుకున్నారు విశ్వనాథవంటి మహాకవులు శిల్పదృష్టితో వీక్షించి, ప్రశంసించి, ప్రశంసార్హమగు విమర్శలను వెలువరించినారు కవులయొక్క దేశకాల పరిస్థితులను, కవి యుద్దేశమును దృష్టి యుంచుకుని పాఠకుడు చూచినపుడే ఆయా కావ్యములయందలి వైశిష్ట్యము గోచరించును మన ప్రబంధాలలో శృంగార వర్ణనయందు ఆయా కవులు విలక్షణ శైలిలో రచించి ఎవరికి వారే సాటియని యనిపించుకున్నారు

శ్రీనాథుని శృంగార నైషధము ప్రబంధ రచనకు ఒరవడి దిద్ది మార్గదర్శకమైనది రాయల కాలములో రాయలతోపాటు అతని ఆస్థానకవులు ఒకరినిమించిన రచన మరొకరు చేసి అపురూపమైన ప్రబంధములను వెలయించినారు రాయలవారి ఆముక్తమాల్యద, అల్లసానివారి మనుచరిత్ర, తిమ్మన 'పారిజాతాపహరణము', రామరాజ భూషణుని 'వసు చరిత్ర', తెనాలి రామకృష్ణుని పాండురంగమాహాత్మ్యము, సూరన కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నము, మొ॥నవి తెలుగు సరస్వతికి మణిహారములు ఈ ప్రబంధము అధికంగా వెలువడిన కారణంగా రాయల కాలమును ప్రబంధయుగము అందురు 17వ శతాబ్దిలో చేమకూర వేంకటకవి విజయవిలాసము, ముద్దుపళని రాధికా సాంత్వనము చెప్పుకోదగిన ప్రబంధములు తెలుగు సాహిత్యములో శృంగారపరంగా పేర్కొనదగిన గ్రంథములింకను శేషము వేంకటపతి శశాంక విజయము, పిల్లలమఱ్ఱి 'శృంగార శాకుంతలము', కనుపర్తి అబ్బయామాత్యుని అనిరుద్ధ చరిత్రము, కందుకూరి రుద్రకవి నిరంకుశోపాఖ్యానము, సారంగు తమ్మయ వైజయంతీ విలాసము, కూచిమంచి తిమ్మకవి నీలాసుందరీ పరిణయము, వినుకొండ వల్లభరాయని క్రీడాభిరామము, విశ్వనాథ శృంగార వీథి మొదలగునవి గణింపవచ్చును మచ్చునకు కొన్ని ప్రబంధములలోని శృంగార వర్ణనా శిల్పవిశేష, చమత్కారములను వివరించుట ప్రకృత వ్యాస ఉద్దేశము

### మను చరిత్రము

అల్లసాని పెద్దన మను చరిత్రలో నాయిక వరూధిని ప్రబంధ నాయికలలో పేరెన్నికగన్నది మను చరిత్రలోని వరూధినీ ప్రవరాఖ్య ఘట్టము మిక్కిలి రసవంతమైనది గృహస్థుడైన ప్రవరుడు పుణ్యతీర్థ సందర్శనా కాంక్షచే నొక సిద్ధుని వలన పాదలేపమును పొంది తత్ప్రభావమున హిమవన్నగమును దర్శించి తన్మయుడగును మంచువలన కరిగిపోయిన పాదలేపమును చూచి యింటికేగు విధమెఱుంగక నట సచరించు సమయమున నలకూబర సన్నిభుడైన ప్రవరుని వరూథిని యను అప్సరస

చూచి, ఝళం ఝళత్కటక
  సూచిత వేగ పదారవిందయై
లేచి కుచంబులున్ దుఱుము
  లేనడు మల్లలనాడ నయ్యెడన్
బూచిన యొక్క పోక నను
  బోదియ జేరి విలోకన ప్రభా
వీచికలన్ దదీయ పద
  వీ కలశాంబుధి వెల్లిగొల్పుచున్

ఉన్నదట ఆమె పాదారవిందములకున్న అందియలు ఝళం ఝళన్నా

ు చేయుగా నతి సంభ్రమముతో లేచి
వంబులు,' కొప్పును, లేతనడుము నల్లల
డగా శనొక ప్రోక చెట్టు బోదె నాను
ని నిలుచుండెను ఆమె యెంత సోయ
ుతో లేచి నిలుచున్నదో అట్టి
శ్యము పాఠకుల కనులముందు నిలుచు
ు వర్ణించుట యిందలి విశేషము అల్ల
నివారీ పద్యములో వరూథిని యంది
ల ఝుళం ఝుళనాదాలు కూడా పాఠ
ుకు విన్పించినారు

ప్రవరాఖ్యుడు వరూథినిని జూచి
న్వ తెవీవు, భీతహరిణేక్షణ ?' యని సం
ధించి, తాను త్రోవ దప్పితినని చెప్పి
ని ఇంటికిపోవు తెఱు వడుగును అప్పుడు
గాయలొప్పగ పరిహాసముగ నవ్వి వరూ
యిట్లన్నది

ంతలు కన్నులుండ దెరు
వెవ్వరి వేడెదు భూసురేంద్ర! యే
ంతము నందునున్న జవ
రాంద్ర నెపంబిడి పల్కరించు లా
తియ గాక నీ వెఱుగ
వే మునువచ్చిన త్రోవ చొప్పు నీ
త భయంబు లేకడుగ
వెల్లిద మైతిమె? మాట లేటికిన్'

'ఇంత పెద్ద కన్నులుండగా దారి
వరి నడుగుతావు? ఏకాంతములోనున్న
రాంద్రను పల్కరించు నెపము
క నీవెఱుగవా మును వచ్చిన త్రోవ
కొంచెమైనను భయము లేక యడు
ంకంత చులకనైతిమా! మాటలేల ?'
బెదరింపు ఇందలి సామాన్యార్థము
ని ఇందు వరూథిని నర్మగర్భంగా
ంతలు కన్నులున్న దానిని వేయుండగా
రి వేరెవ్వరి నెందుకు అడుగుతావు
ంకూలమును గ్రహించియే పల్కరించి
పోవ లెననుకొన్న నీకు త్రోవ తెలి
దా! నీకు ఏమాత్రము భయములేదు
స్వర మొండొరుల భావముల తెలిసి
ంటి మింక మాటలెందుకు' అను తన
నోభావమును స్ఫురింపజేసినది వరూ
ని ఇంత చమత్కారముగా మాట్లాడిం
చుటలో అల్లసాని వాని అల్లిక జిగిబిగి
బాగా కనిపిస్తుంది

కొంత సేపటికి ప్రవరుడు సుముఖుడు
కాకపోయేసరికి లాభములేదని తలంచి
నిక్కము దాపనేల ధరణీసురనందన
యంటూ తన నిజ మనోభావమును తేట
పఱచినది ఇంద్రియ సుఖమే పరబ్రహ్మా
నందమని వచించినది అయినను ప్రవరుడు
'మోక్షలక్ష్మి పద్మాగమ సూత్రపంక్తి
కివె పోమీ సంప్రదాయార్థముల్' అని
తృణీకరించినాడు వరూథినినిస్పృహ జెంది
'వనిత తనంత తా వలచివచ్చిన చుల్కన
గాదె యేరికిన్' అని తలపోసినది ఇంక
మాటల పని అయిపోయినది ఊరకుండి
నచో ప్రవరుడు పోవునట్లుతోచు చున్నది
అభిమానమును మించిన విరహ తాపము
ఆమెను ఉక్కిరిబిక్కిరి చేయుచున్నది
కాబట్టి వరూథిని చేయునదిలేక 'పతలం
బెట్టకు మింక నన్నునుచు' నీవీ బంధ
మూడగా, కొప్పువీడగా తను వనెడి లత
పులకింపగ అనునయాలాపాతిదీనాస్యయై
ప్రవరుని కౌగిలించుకొని అధర మానింప
బోవును అప్పుడు పద్యము

'ప్రాంచ దుద్భవణ బాహుమూల
రుచితోఁ బాలిండ్లు పొంగారఁ బై
యంచుల్ మ్రోవగఁ గౌఁగలించి
యధరంబానింప హా శ్రీహరీ!
యంచున్ బ్రాహ్మణుఁ డోరమోమిడి
తదీయాంస ద్వయంబంటి పొ
మ్మంచున్ ద్రోచెఁ, గలంచునే సతులమా
యల్ ధీరచిత్తంబులన్'

ధీర చిత్తములను సతుల మాయలు
సంచలింపఁ జేయఁజాలవని పెద్దన ప్రవరుని
పాత్రను సమర్థిస్తూ అప్పటి సంఘటనను
పాఠకుల కనులకు కట్టినట్లు వర్ణించుట
ఇందలి వైశిష్ట్యము

## పారిజాతాపహరణము

నంది తిమ్మన 'పారిజాతాపహరణము'
లోని సత్యభామ శ్రీకృష్ణుని ముద్దులగుమ్మ,
శృంగార రసాధి దేవత నారదుడు వచ్చి
రుక్మిణి ఇంటిలో కృష్ణునకు పారిజాతము
నిచ్చుట, అద్దాని నా వల్లనివాడు భోజా
త్మజకిచ్చుట, నారదుడు రుక్మిణి అందము
పారిజాతమువలన అతిశయించిన దని
పొగడుట జరిగినది కేవల పొగడ్త వలన
నారదుని మనసు తృప్తికాలేదు కనుక

'చక్కని దాననంచు నెల
జవ్వని నంచు జగంబులోనఁ జే
రెక్కిన దాన నంచుఁ బతి
యెంతయు నా కనురక్తుడంచుఁ దా
నిక్కుచు నిట్టువీగుచు గ
ణింపదు కాంతల సత్య యింతకున్
స్రుక్కక యున్నె నీ మహిమ
సూచినఁ బోటులు విన్నవించినన్'

అని రుక్మిణితో సత్యభామా ప్రసక్తిని
దెచ్చి కలహ బీజము నాటినాడు ఈ
ప్రసక్తి జరుగనున్న కథ కంతకు
నాయువు పట్టు ఈ పద్యమునందు నార
దుడు అలవోకగా యన్నట్లు తోచదు.
'బోటులు విన్నవించినన్, స్రుక్కక
యున్నె' వంటి పదములనుఁబట్టి చెలి
కత్తెలు సత్యభామతో ఇచ్చటి విషయ
మంతయు విన్నవించి కలహబీజము నాట
విలయుననియే యతని యుద్దేశమైనట్లుఁ
తోచును ఎట్లైనను అతని సంకల్పము
నెరవేరినది

సత్యభామ అభిమానము దెబ్బతిన్నది.
హృదయములో క్రోధమునిండినది సర్వా
లంకారములను వీడి కోపగృహములో
ముసుగు వెట్టినది గోపాలుడు అనుమాన
ముతోనే సత్యభామాదేవి ఇంటికి వచ్చి
నాడు నిజమై కన్పించినది ముసుగున
నున్న సత్య చెంతకుఁజేరి తాలవృంత
ముతో వీచినాడు ఎంతయో అనునయించి
నాడు ఫలితం లేకపోగా పాటలగంధి
చిత్తముఁ గాటిలం కోపభరంబు దీర్ప
'మృదుపల్లవ కోమల తత్పద ద్వయీ
పాటలకాంతి మౌళిమణి పంక్తికి వన్నియ
వెట్ట నా జగన్నాటక సూత్రధారి యదు
నందను డర్మిలి మ్రొక్కె' నచటలో

సత్యభామ సుకుమారత్వము, కృష్ణుని జగన్నాటక సూత్ర ధారిత్వము అనగా అన్నీ తెలిసినవాడు ఏపనిఎందుకుచేస్తాడో ఎవరికి తెలుసుననుట తిమ్మన రమ్యముగా చెప్పినాడు. బ్రహ్మ, ఇంద్రాది దేవతల పూజకు నిలయమైన మన్మథుని తండ్రి శిరము అక్కడ వామ పాదంబునఁ దొలగం ద్రోచె లతాంగి యన్న విషయమును 'అట్లయగు నాథ లేనేరములేనియఁ జేరలుకం జెందిన యట్టి కాంతలుచిత వ్యాపారములెన్నరుకే' యని తిమ్మనకవి సమర్థించినాడు ఇది యెంతవరకు సమంజసమని కనుబొమ లెగుర వేసేవాళ్ళూ ఉన్నారు. కాని కృష్ణుడు మాత్రము

'నను భవదీయ దాసుని మ
నంబున నెయ్యపుఁ గిన్కఁబూని తా
చినయది నాకు మన్ననయ
చెల్వగు నీ పద పల్లవంబు మ
త్తను పులకాగ్ర కంటక వి
తానము దాకిన నొచ్చునంచు నే
ననియెద నల్క మానవుగ
దా యికనైన నరాళ కుంతలా'

అన్నాడు సత్యభామతో. ఇందు సత్యభామ నిజ మనస్స్వభావ మెఱింగి తదనుగుణంగా మలచుకున్న ఉదాత్త శృంగార రసస్ఫూర్తి నొందిన దక్షిణ నాయకుడైన శ్రీకృష్ణుని హృదయము మాత్రమే కనిపిస్తుంది. కాని స్త్రీలోలత్వము, అసమర్థత కాదు. ఈ విధముగా ఆయా సన్నివేశములందు తదనుగుణముగా రసమును పోషించుటలో తిమ్మన అనన్య సామాన్య ప్రతిభను చూపించినాడు. పారిజాతాపహరణ కావ్యములోని సత్యభామ పాత్ర కవి తిమ్మనయొక్క విలక్షణ సృష్టి

## విజయ విలాసము

చేమకూర వేంకటకవి 'విజయ విలాసము' ప్రతిపద్య చమత్కృతితో కూడిన శృంగార ప్రబంధము. అర్జునుడు తీర్థయాత్ర పేరిట జరిపిన విలాసయాత్రలో ఉలూపీ, చిత్రాంగదా, సుభద్రలను వివాహ మాడుట అందలి ఇతివృత్తము సుభద్రను పొందుటకై, బలరాముని నమ్మించుటకై అర్జునునకు యతివేషము వేయక తప్పింది కాదు.

'ఉండెబో కాంత రసమెల్ల నుట్టిపడఁగ నంగనల పొందురోసి సన్యాసి యగుట గద యుచితమెందునా నవమదన మూర్తి యంగనామణిఁ గోరి సన్యాసియయ్యె'

నని ఈ పద్యములో లోకప్రవృత్తికి, కథావకాశమును జోడించుకొని విరోధాభాసాలంకారముతోఁ జెప్పుటలో చమత్కారమున్నది.

కుహనా సన్యాసి యని తెలియక అర్జునునకు సుభద్ర సేవలు చేస్తున్నది. అర్జునుని మీది ప్రేమకొద్ది యా లలితాంగి ఆ సన్యాసికి పుణ్య తీర్థములందెక్కడైన తీర్థయాత్రకు వెడలిన పాండవ మధ్యముడైన 'నరుని' అందందు నరుఁగానరుగా యని యడుగుటకు ముందు అర్జునుని ఆకారమిట్లుండునని చెప్ప దొడంగినది.

ఎగుబుజంబులవాడు మృగరాజ మధ్యంబు
పుడికి పుచ్చుకొను నెన్నడుమువాడు
నెతి వెండ్రుకలవాడు నీలంపు నికరంపు
మెఱుగుఁ జామన చాయ మేనివాడు
గొప్ప కన్నులవాడు కోదండ గుణకిణాం
కములైన ముంజేతు లమరు వాడు
బవిరి గడ్డము వాడు పన్నిదంబిడి డాఁగ
వచ్చు నందపు వెన్ను మచ్చవాడు
గరగరని వాడు నవ్వు మొగంబు వాడు
చూడఁ గలవాడు మేలైన సొబగు వాడు
వావి మేనత్తకొడుకుఁ గావలయు నాకు
నర్జునుండు పరాక్రమోపార్జునుండు

అర్జునుని సుభద్ర చిననాటి నుండియే ప్రేమించుచున్నది తీర్థయాత్రకుబోకముందెప్పుడు చూచినదో! మళ్ళీ అతనిని కలుసుకోవాలనే తపన యామెలోనున్నది. అందుకే సన్యాసి కదాయని యడిగింది. అర్జునుని పట్ల తనకున్న శ్రద్ధ ఆ సన్యాసి కెట్లుండును! అని యామె ఊహ అతడు వేరొకరినిఁ జూచి అర్జునునిగా భావించినచో తనకు తన బావగురించి తప్పుడు సమాచారము అందే అవకాశమున్నదని తలంచి ఇట్లు చెప్పుటలో అర్జుననిపై సుభద్రకుఁగల ప్రగాఢమైన ప్రేమ నిగూఢముగా ద్యోతకమగుచున్నది

ఇట్లుండగా నా కుహనా సన్యాసికి సుభద్ర సోయగములను జూచు నాశచే విరహమతిశయించి ప్రేయసి కనులయెదుట నున్నపుడూ, లేనియపుడును ఒక్క తీరయ్యెనని నిరాహారుడైయున్న యతం డప్పటి పరిస్థితి నెంత అందముగానో జీర్ణించుకున్న పద్యము

'మును పు సైపదు సంతోషమున భుజింప
వెనుక సైపదు చింత చేతను భుజింప
బాలకడ నున్న యపు డెడఁబాసినపుడు
నొక్క తీరయ్యె భరతవంశోత్తమునకు'

అనునది. దీనికంతయు కారణము కుహనా సన్యాసి యర్జునుఁడని యెఱిగిన సుభద్ర సిగ్గుపడి ప్రమద వనాంతరమునకు పోవుట మానినది. ఇట్లు ప్రమదవనములో నర్జునుడు అట అంతఃపురములో సుభద్ర ఒండొరులు కలుసుకు నేసాహసముచాలక విరహముతో నొకరి నొకరు తలంచుకొనుచున్నారు ఇదే పరిస్థితిలో పదినెలలు సుభద్రతో మేలము లాడ దొడంగిరి అందు సత్య కొంచెము గడసరి కనుక

'క్రాగి యున్నది మిగుల నంగంబు చూడఁ
గలవరించుచు నున్నది కలదొ యేమొ
సోకుడల్ల సన్యాసికే చూపవలయు
భామ నని పల్కె నాసత్యభామ నగుచు'

లోకములో సామాన్యముగా గాలి సోకుడునకు సన్యాసులకు చూపింతురు తల్లక్షణములను పోలిన విరహమను గాలి సుభద్రకు సోకింది విరహకారణుడైన అర్జునుని వల్లనే యది మానునట్టిది సన్యాసి అర్జునుడని రుక్మిణీ సత్యలకు తొలుతనే

# కృష్ణమంజరి - తరిగొండ వేంకమాంబ

- శ్రీ



ఇది ఒక శతకం అయితే కవయిత్రి దీనిని ద్విపదలో అందునా మంజరీ ద్విపదలో సాగించారు గ్రంథనామం 'కృష్ణ శతకం' అని కాకుండా 'కృష్ణమంజరి' అని ఉంచడంలోనే ఆ విశేషం స్పష్టమౌతోంది.

వెంగమాంబ జీవితకాలం 19వ శ మధ్యభాగమన్న బ్రౌను దొర అభిప్రాయంతోనే పలువురు విమర్శకులు ఏకీభవిస్తున్నారు

ఈ కృతి మంజరీ ద్విపద రూపంలోని శతకం అన్నాం ద్విపద తెలుగు సాహిత్యంలో ఒక ప్రత్యేక శాఖగా ప్రతిష్ఠగడించింది. మార్గ, దేశి అనే రెండు సంప్రదాయాలుగా ప్రవర్తిల్లిన తెలుగు సాహిత్యంలో 'ద్విపద' అనేది పేరును బట్టే పద కవితకు సంబంధించినది.

ఇది మాత్రా ఛందస్సుకి చెందిన రెండు పాదాలు కల్గిన రచన. ఒక్కో పాదానికి మూడింద్రగణాలు, ఒక సూర్యగణం ఉంటాయి పాదంలోని మూడో గణం మొదటి అక్షరంపై యతి ఏ పాదం యతి ఆ పాదంతో సరి అలాటి రెండు పాదాల్ని ప్రాస కలుపుతుంది

ప్రాసలేని ద్విపద 'మంజరి' అవుతుంది

ఇక శతకాలంటే భగవన్నుతి రూపాలైన ముక్తక కావ్యాలు. 'కథా సూత్ర సంబద్ధత'తో పనిలేకుండా వేటికవే స్వతంత్రాలై వుంటాయి కాబట్టి ముక్తకాలౌతాయి సాధారణంగా వీటిలో శత పద్యాలుంటాయి-కాబట్టి ఆ పేరువచ్చింది అయితే సంఖ్యతో నిమిత్తం లేకుండా శతకాలు చెప్పినవారూ ఉన్నారు శతకాల్లో ప్రతిపద్యం చివర సమానమైన మకుటం వుంటుంది సాధారణంగా మకుటం సంబోధనాత్మకమై ఏక,ద్వి,త్రి,పద ఘటితమైగాని, పాదంలోని స్వల్ప భాగాన్నో, పాదార్థాన్నో, పాదం మొత్తాన్నో ఆక్రమించి కాని వుంటుంది.

శతకాలు సాధారణంగా గ్రంథకర్తల ఆత్మభావాల్ని ప్రకటించేవిగా వుంటాయి 'కృష్ణ' మకుటంతో మొత్తం నూట ముప్పై ఏడు ద్విపదలతో కూడిన ఈ 'కృష్ణ మంజరి' నుంచి వెంకమాంబగారి ఆత్మతత్త్వం సుస్పష్టం అవుతుంది తాను నమ్మిన ఆ భగవంతునికి భక్తితో తన హృదయాన్ని కవయిత్రి వినయపూర్వకంగా విప్పి చెప్పుకోవడం జరిగింది ఆ వినయ పూర్వక విజ్ఞాపనలే ఈ ద్విపదలు ఇంకా చెప్పాలంటే - ముఖ్యంగా జనన మరణ దుఃఖభరితమైన ఈ సంసార వలయాన్నుంచీ తప్పించుకొని- ముక్తిని పొందే మార్గం చూపుమంటూ ఎంతో ఆరాటంతో వ్యక్తం చేసుకొన్న ఆత్మని వేదన అనాలి.

( 3 వ పేజీ తరువాయి )

గృష్ణుని వలన తెలిసియున్నది రుక్మిణి పాత్రీవరాలు ఎక్కువగా ఏడిపించదు. సత్యభామ శ్రీకృష్ణునే పట్టి ఆడించిన చతురురాలు కనుక ఇక్కడ సత్యభామ మాత్రమే ఇవ్విధముగా మేలమాడుటలో ఔచిత్యమున్నది.

ఈ విధముగా తోలంత పేర్కొనబడిన ప్రబంధము లన్నిటియందు కొద్దో, గొప్పో శృంగార రస సంబంధమైన కవితాల్పము, చమత్కారాదులు కనిపించును. వ్యాస విస్తర భీతిచే కొన్ని ప్రబంధములలోని కొన్ని యంశములు ఉటంకింపబడినవి.

కృతి ప్రారంభపు ద్విపద శ్రీ వేంకటేశుని పేరుమీదనే సాగడం కాక, కృతి సమర్పణ కూడ శ్రీనివాసునకే నని కృత్యంతంలో చెప్పిన

'వరభక్తితో శ్రీనివాసుని దివ్య
పదయుగళికి సమర్పణ మొప్పజేసె'-

అనే ద్విపద నుంచీ తెలుస్తోంది అయినప్పటికీ- ఈ శతకంలోని 'కృష్ణ' మకుటంవల్లను మరియు కృత్యంతంలో ఫలశ్రుతిగా చెప్పిన ద్విపద

'మొనసి కామ్యార్థమున్ మున్నిచ్చితుదను
పరమ పదం బిచ్చు బాలకృష్ణుండు'

వల్లను, ఈ కవయిత్రికి బాలకృష్ణునిపై గల మిక్కుటమైన ప్రేమ కూడ స్పష్టమౌతోంది

ఇక శతకంలో కవయిత్రి ఆత్మభావాల్ని ప్రకటించుకున్న తీరు 'పాపకర్మ'లు చేసి చేసి ఎన్నెన్నో జన్మలెత్తి అలసిపోయియున్నాను కృష్ణా! ఈజన్మలోనైన- నీ పాదాంబుజమనే నావనిచ్చి నన్ను ఈ మాయాబ్ధినుంచి దాటింపవా కృష్ణా!' అని వేడుకుంటూ 'కలలో నైతమూ నీ మూర్తినే తప్ప ఇతరమేమీ కనిపింపనీయకో కృష్ణ'- అని అర్థిస్తూ- ఆ దివ్య మంగళరూపాన్ని సుస్పష్టంగా దర్శించుకోవాలన్న గాఢమైన వాంఛని కృష్ణునికి తెల్పుకుంటూ -

'కలనైన నీమూర్తిగాని యన్యంబు
నేమైనఁ గనుపింప నీయకే కృష్ణ.
కనకరత్న ప్రభాకలిత మైనట్టి
సురుచిర మకుటుంబు- జూపవే కృష్ణ
తళుకైన కుటిల కుంతల యుక్తమైన
సలలిత ఫాలదేశముఁ జూపు కృష్ణ
సుందర భూలతా శోభితంబైన
కనుఁగవ వెలుప చక్కఁగ జూపు కృష్ణ.
మీరిన సంపెంగ మొగ్గ నైవడిని
కమనీయమగు నాసికముఁ జూపు కృష్ణ

శంఖ చక్ర గదాబ్జ సహితంబులగుచు
నొనరు చతుర్బాహులనుఁ జూపు కృష్ణ
కౌస్తుభ మణిహార కలితమైకంజ
నిభమైన కంఠంబు నెతిఁ జూపు కృష్ణ

పలుమఱు విశ్వకల్పన సేయు బ్రహ్మ
సదనమౌ నాభికంజముఁ జూపు కృష్ణ.

బ్రహ్మ రుద్రాది దిక్పతులైన వారు
మ్రొక్కనొప్పగుపాదములఁజూపుకృష్ణ.

ఎన్నెన్నో చిహ్నల కిరవైన వదన పరిపూర్ణ చంద్ర బింబాన్ని చూపమని కోరుతూ అలా ముప్పై ద్విపదల వరకు చెప్పి చెప్పి చివరకు-

అనేక మహర్షులు అనేక విధాలుగా బ్రహ్మ స్వరూపాన్ని అవగాహన చేసి కోవడానికీ, నిరూపించడానికి దర్శించడానికి, ఉపాసించడానికీ ఎంతోకృషి చేసిచేసి చివరకు ఎంతకు అంతుపట్టక,అవగాహనకి అందక, చెప్పశక్యం గాక- అది (బ్రహ్మము) అంతట నిండైనదేననీ, ఎంతైనను పూర్ణమైనదేననీ-

'పూర్ణ మదః పూర్ణ మిదం
పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ
పూర్ణ మేవావ శిష్యతే'

అన్నట్లుగా- అంటే అది (బ్రహ్మము) పూర్ణము ఇదియు (జగత్తు) పూర్ణము పూర్ణము నుండి పూర్ణ ముదయించినది. పూర్ణము నుండి పూర్ణమును తీసివేసినను పూర్ణమే మిగులును- అంటూ బ్రహ్మ విషయ మింకా ఎంత చెప్పినా- అసంపూర్ణమే అని మాటాడజాలక మౌనముద్ర వహించిన మహర్షుల విషయం గుర్తొచ్చి కాబోలు-

'ఇదమిత్థ మనఁ గూడ దిల్ల విశ్వంబు
తానైన వస్తుతత్త్వముఁ జూపు కృష్ణ'

అని అంటారు కవయిత్రి అంటే 'ఇదీ అని చెప్పలేని విశ్వమే నీవైన వస్తు తత్త్వం చూపు కృష్ణా!' అని అడుగుతారు

ఎన్నెన్నో చిహ్నలకు ఇరవైన ఆవదన పరిపూర్ణ చంద్రబింబాన్ని చూపమని అంతసేపు కోరినా- చివరకు ఆ పరతత్త్వాన్ని తెలుసుకోవాలన్న కాంక్షనే వ్యక్తంచేశారు అందుకే అంటారు 'ఈ వసుధలో గురుకుల వాసంచేసే శక్తి నాకు లేదు నీవే సద్గురు స్వామివై- బోధచేసి కడతేర్చు కృష్ణా!' అని

కేవలం ఆ స్వామిని అలా కోరడం మాత్రమే కాదు తనబాధ్యత పూర్తిగా ఆ స్వామిపైనే వేసేస్తారు' ఇన్నాళ్లూ నీవే బాధ్యుడవని తెలిసికోలేపోయాను ఇప్పటికైనా నీ దయవల్ల తెలుసుకున్నాను నీ సొమ్ము నేను నీవు స్వామివి. కాబట్టి నాబాధ్యత నీకు తప్పదు' అని అనడం కాక అలా తన బాధ్యతన తటీనీ భగవంతునిమీద వేసేసి- అనిశ్చింతతలో- 'నాకిక జన్మలేదని ప్రమాణం చేసి చెప్తున్నాను కృష్ణా!' అని అంటూ- 'ఎన్ని పుణ్యాలు చేసి ఇంత ధైర్యంగా చెప్తున్నాననుకుంటావేమో! సమస్తపాపాలు చేశాను నాదుర్గుణాలు లెక్కించలేనన్ని' అంటూ తానిక జన్మనెత్తనని చెప్పడానికి గల్గిన ధైర్యానికి గల కారణాన్ని ఎంతో గడుసుపోకడతో చెప్తారు.

'ఏ పుణ్యములు చేసి యింత ధైర్యంబు
చేసితి నంటేని చెప్పెద కృష్ణ
పరఁగ నేఁ జేయు పాపము లిన్నియనుచు
గుఱిచేసి లెక్కింపఁ గూడదే కృష్ణ
అతిదంభ కుత్సితాహంకారములకు
ధరను నేమూల భూతమనైతి కృష్ణ
..
అటుగాన పతిత జనాగ్రణినైతి
పలుమఱు నిన్ని చెప్పఁగ నేలకృష్ణ'

'ఇన్ని చెప్పడమెందుకు, పతితులలోనే అగ్రణిని నేను అయితే నేమి? 'పతిత పావనుడ' వన్న నీ బిరుదునే పట్టుకున్నాను' అంటూ తాను జన్మనెత్తనని ప్రమాణం చేయడంలో గల ఆంతర్యాన్ని వివరించి చెప్తారిలా -

' . . .నీ పతిత
పావన బిరుదు చేపట్టితి కృష్ణ
మును పజామిళు నిమ్మగఁ బ్రోచినట్టి
ఘన బిరుకే నన్నుఁ గడతేర్చు కృష్ణ
వసుధ నీపతిత పావన కీర్తి బిరుదు
పట్టితి నాకింక భయమేమి కృష్ణ
ఈ బిరుదును బట్టి యిఁక జన్మమెత్త
నని ప్రమాణమ్ము చేయఁగవచ్చు కృష్ణ

పూర్వం అజామీళుణ్ణి బ్రోచిన ఘనమైనఆబిరుదు నన్నుమాత్రంకడతేర్చదా? అదే నా ధైర్యం.' అనీ అనగల్గినారంటే- భగవంతుడి ముందు సైతం అటువంటి గడుసుపోకడ వెంకమాంబగారి వంటి అనన్య భక్తులకే చెల్లుతుందేమో!

అంతటి పరమార్థచింత గల్గిన ఆమెలో లోకజ్ఞత కూడ లేకపోలేదు. చక్కటి లోకోక్తుల్ని కూడ సమయానికి గుర్తు చేస్తారు.

'నేను నీ సొమ్ము, సొమ్ముకల్గిన నీవు సొమ్ము తీసుకోడానికై ఇన్నిసార్లు చెప్పడం ఎందుకు కృష్ణా! నీసొమ్ము నేను తీసుకోతగ్గదైతే తీసుకో. పోగొట్టదల్చితే పోగొట్టు దీనికోసం ఇంకా ప్రార్థించడం ఎందుకు?'- అంటూ భగవంతుడి మీదే నిష్ఠూరంవేస్తూ- నువ్వు ఎక్కడ పడేస్తే నేను అక్కడేవుంటాను తర్వాత కష్టనష్టాలు ఎవరివోగుర్తుంచుకో'-అంటూ ఇలా హెచ్చరిస్తారు.

'సొమ్ము కల్గిన నీవు సొమ్మైగొనెడి
పనికైనె యిన్ని చెప్పఁగ నేల కృష్ణ.
హరి నేను నీ సొమ్మునైతి నీకింక
గైకొనఁ దగియున్నఁ గైకొను కృష్ణ
పోగొట్టఁ దలచితే పోఁగొట్టు దీని
కేనింక ప్రార్థింప నేలయ్య కృష్ణ.
నీవు వేసిన దిక్కునే యుందు హాని
లాభంబు లెవరివో లక్షింపు కృష్ణ'

ఈ సందర్భంలోనే కవయిత్రి- 'కపి కిశోర న్యాయం', 'మార్జాల కిశోర

న్యాయం' అనే లోకోక్తుల్ని ఉపయోగిస్తారు

కోతి తనపిల్లల్ని-తనతోపాటు కొమ్మ కొమ్మకి తీసుకుపోవడంలో ఏ మాత్రం జాగ్రత్త చూపకపోయినా- పిల్లలే తల్లిని జాగ్రత్తగా పట్టుకొని వెంట వెళ్తుంటాయి పిల్లి మాత్రం అలాకాకుండా- పిల్లల్ని జాగ్రత్తగా తనతో తీసుకుపోయి ఒకచోట చేర్చివస్తే- మళ్ళీ తల్లి వచ్చి మరోచోటకు చేర్చేవరకు- ఆ పిల్లలు అలాగే వుంటాయి అదే 'మార్జాల కిశోరం' మాదిరి- నేనుకూడ- నీవు పెట్టిన చోటులోనే వుంటాను తప్ప-'కపికిశోర న్యాయ' మార్గంగా కూడ నాలో స్వశక్తి లేదు కృష్ణా'' అంటూ భారమంతా ఆ కృష్ణ పరమాత్మ మీదే వేసేశారు కవయిత్రి-

'రహీమీఅ కపి కిశోర న్యాయ మాత్ర
మేని స్వశక్తి నాయెడ లేదు కృష్ణ
సాలసి మార్జాల కిశోరంబు వలెనె
నీవు పెట్టిన చోట నేనుందు కృష్ణ'

ఆ విధంగా లోకన్యాయాల్ని ఏకరువు పెట్టి ఊరుకోలేదు 'ప్రాణ ప్రయాణ సమయంలో వాతపైత్య శ్లేష్మ బాధల్లో నిన్ను మఱువనివ్వకు. పాపపు దేహాన్ని ప్రపంచ వాసనల వేపు పోనివ్వక నన్ను దరిజేర్చు'- అంటూ- కాలం సమీపించి తనను తీసుకుపోయే సమయంలో తన స్వతంత్రం ఏమీ ఉండదంటూ ముందే విన్నవించుకుంటారు

'ప్రాణప్రయాణ కాలమున
నీవు నా ముందఱ నిలుకవే కృష్ణ.
అలవేళ వాతపైత్య శ్లేష్మ బాధ
లంటిన మఱవనీయకు నిన్ను కృష్ణ

పాపపు దేహ ప్రపంచ వాసనల
తోఁచనీయక నన్ను దుదఁజేర్పుకృష్ణ

కాలంబు చేరువై కదిసి కొంపోవు
తఱియందు నాసాతంతర మేమి కృష్ణ'

అంటూ 'ముక్తిపొందే ఉపాయం తప్ప కుండా చూపించు కృష్ణా!' అని ఎంతో ఆరాటాన్ని వ్యక్తంచేస్తారిలా -

'దేవనే ముక్తిఁ బొందెడి యుపాయంబు
భావించు ప్రజ్ఞ తప్పక చూపుకృష్ణ
అత్యాతురంబుగా నంటి నీ మాట

. '

తనకు తోచినవన్నీ మనవి చేసుకున్నానని- తప్పొప్పుల్ని కాచి దయచూడమనీ అంటారు చివరికి-

'నిన్నిట్లు వినుతింప నేనెంత దాన
తప్పొప్పులను గాచి దయఁ జూడుకృష్ణ'

శతకం చెప్పిన కవయిత్రిని మాత్రమే గాదు ఈ శతకం చదువుతున్న పఠితలకు సైతం 'మన తప్పొప్పుల్ని కాచి దయ చూడడా ఆ కృష్ణపరమాత్మ!' అని అనిపించకపోదు కవయిత్రి భావంతో లీనమైపోయి- తానే కృష్ణునికి తన హృదయాన్ని నివేదించుకొంటున్నట్లు పఠిత కూడ తాదాత్మ్యం పొందితీరుతాడని పిస్తుంది

వేయికిపైగా నున్న శతకాల్లో- దేశీయచ్ఛందంలో సరళంగా సుబోధకంగా నున్న వెంకమాంబగారి ఈ కృష్ణమంజరికి కూడ ప్రశస్తమైనస్థానం ఇవ్వక తప్పదు

—

# 'అనాథ' కావ్యం - జాషువా మానవతావాదం

— శ్రీ బి శివ

జాషువా మహామానవతావాది ఆయన మానవతా వాదానికి 'అనాథ' కావ్యం నిదర్శనం ఆయన ధనంచేత, కులంచేత అట్టడుగున పడిన సమాజ లో బాధలకు గురౌతున్న పీడితుల్ని, తాడితుల్ని చూచి ఆవేదనతో కరిగిపోతాడు. పీదల బాధలు పరిష్కారం కావడానికి ఆయన సూచించే మార్గం మానవతామార్గం సమాజ లో అట్టడుగున పడినవారిమీద ఉన్నతవర్గాల వారిలో సహృదయత పెంపొందితే వారి పరిస్థితి మారగల దని జాషువ అభిప్రాయం ఆ సహృదయత నే ఆయన భగవంతుని నివాసస్థానంగా భావిస్తాడు అనాథకావ్యం అంతా ఈఅంశంమీద నే ఆధారపడియున్నది అందుచేత నే కావ్యానికి మకుటాయమానం గా మొట్టమొదట చెప్పిన పద్యం కవి మానవతావాదానికి పరాకాష్ఠగా వుంది

''పసుల దుర్గతిఁగని గుండెగఱగి కరఁగు
సదయహృదయులవీక్షణాంచలములందుఁ
బుట్టు మందును కన్నీటిబొట్టువోలె!
ఏఁడి భగవంతు డని సంశయింతు వేల?''

కవి ఈ కావ్యాన్ని పేదరాలి బాధల తోనే ప్రారంభిస్తాడు ఆమె అనాథ. ఏడుగురు బిడ్డల తల్లి కావ్యప్రారంభాన్ని ఆమె బాధతో చేసె కథ చివరికి ఆమె నాదరించినవారివల్ల పొందిన తృప్తితో అంతంచేస్తాడు సహృదయతయే ఆవశ్యక మన్న విషయాన్ని కావ్యఫలంగా వ్యక్తంచేస్తాడు

ఒక అనాథ, నిరుపేద లోకంలో ఎన్ని తిరస్కారాలకు గురౌతుందో వాటన్నిటిని చెప్పడంలో తన లోకజ్ఞతనంతనూ ప్రదర్శిస్తాడు జాషువ. ఆమె ఒకనాటి రాత్రి ఒక మేడ ముంగిట తన బిడ్డలతో, ఆకలితో పడున్నది తెల్లవారింగి ఆ మేడలో ఉన్న ఒక యువతి అక్కడనుండి ఆమెను చీదరించి గెంటివేసింది ఈ సందర్భంలో ఆమె మాట్లాడిన మాటలు లోకంలో వాడుకలో నున్న నుడికారానికి చాల సమీపంలో ఉండి భావోత్తేజన కలిగిస్తాయి ఇది తిక్కనయొక్క మార్గం ఇటువంటి సంభాషణశిల్పమే నుడికారపు సంపదయే అనాథ కావ్యానికి ఆయువుపట్టు ఆ యువతి ఇట్లా అంది''

"ఓసీ! యెవ్వతె వీవు? నీ మగనిసా
మ్మున్నట్లు పాపిష్ఠురా
లా! సంసారము బెట్టినావు మొగసాలన్"

అచటినుండి లేచివెళ్ళగానే ఆమెకు సహృదయత ఎదురౌతుంది. పై యువతికి విభిన్నలక్షణాలుగల ఒక స్త్రీ ఎదురై ఆమెను ఓరడించి కడుపు చల్లార్చి పంపించింది. ఇట్లా అసహృదయతా, సహృదయతల సంఘర్షణమే ఈ కథలోని ప్రధానాంశం తుదకు సహృదయతయే జయిస్తుంది సహృదయతని భగవంతుడుగా కావ్యప్రారంభ లో చెప్పి కవి ఆ విషయాన్ని మరచిపోకుండా సహృదయత ప్రస్తావన వచ్చినచోటనల్లా భగవంతుణ్ణి స్మరించటం గమనించదగ్గ శిల్పం. ఇక్కడ సహృదయురాలు, ఆమె యొక్క, బిడ్డలయొక్క ఆకలి తీర్చిన సందర్భంలో కవి యిట్లా వ్యాఖ్యానిస్తాడు

"క్షుద్రుడవుమని చెప్పి బంగారు గుడులు గట్టి
పెట్టుచుందురు నరులు నైవేద్యములను
సృష్టికర్తకు, దాని భుజింపఁడతఁడు
భిక్షుకుని చేతి యెంగిలి పిడచగాక"

ఆ తరువాత అనాథ ఒక పెండ్లి ఇంటి దగ్గరకు పోగా సైకిలుమీద పోతున్న పోకిల్లా ఒకడు ఆమెపై పడగా, ఆమె నెత్తురుకారుచు నేలపై పడిపోయింది ఈ సందర్భంలో ఆమె భగవంతుడు లేడు అనుకున్న పద్యం కరుణరసానికి ప్రతీక ఇటువంటిచోట్ల జాషువ భావంలోని ఆర్ద్రత, లలితమైన తెలుగుపదాలతో కూడిన శైలి, వేగం, పఠితకు కన్నీరు తెప్పించగలవు. ఆమె ఇట్లా విలపిస్తోంది.

"ఏడు సముద్రముల్ గడచి
యెక్కడ నేపనిమీదఁబోయి యు
న్నాడవురా! పరాత్పరుఁడ!
నా కడగండ్లకు మేర యున్నదా?
మేడకుఁ బోవుదాన? నెటు
లీ కసుగందుల పొట్టనించు నీ
యాఁడు దటంచు నేడిచె మ
హాకరుణాంబుగ డొక్కప్రక్కగన్"

ఇటువంటి తావులలోకూడ జాషువ రచన మనకి తిక్కన్నను జ్ఞాపకం చేస్తుంది.

ఈసందర్భంలో జాషువ లోకస్వభావ పరిశీలనమును వెలువరిస్తుంది పద్యం అక్కడ ఒక మేడమీద సరసమాడే దంపతులు ఏమయిందని అక్కడ మూగిన జనసమూహాన్ని ప్రశ్నించారు. అనాథ ప్రమాదానికి గురికావడం వాళ్ళకు చాల సహజంగా తోచింది.

ఏమీ కలతపడకుండా వెంటనే వాళ్లు తమ ప్రణయంలో మునిగిపోయారు

మళ్ళీ అనాథకి సహృదయత ఎదురైంది ఒక సంసారి ఆమెను వైద్యునింటికి జేర్చి ఆమె వైద్యానికి కొంత ధనాన్ని ఇస్తాడు. అతను ఇంటికి రాగానే అతని ఆచారవంతురాలైన భార్య మాలపడతిని తాకినందుకు అతడు మైలపడ్డాడని స్నానంచేసిగాని అతడు ఇంటిలోకి రావడానికి వీలులేదని చీదరించుకొంటుంది. కాని భర్త "నీతికోవిదుడు". అందుకని ఆవిడతో వివాదము పెట్టుకోకుండా ఆమె చెప్పినట్లే అనుసరించి, ఆమె ఏమన్నా కోపగింపక ప్రశాంత సమయంలో ఆమెకు విషయాన్ని బోధించడానికి ప్రయత్నిస్తాడు

"తలుక శమించెనా? జలక
మాడిన యంతనె? మాలదాని పి
ల్లల కడగండ్లు చూచి బహు
ళంబుగ దప్తతనందు నా మనో
జలజము మైలపడ్డదది
స్నానము చేసెనె? వెఱ్ఱిదాన! యీ
వెలుపలిశుద్ధి జీవులకుఁ
బెట్టునె, పోయునె? ముక్తినిచ్చునే?"

ఈ మాటలతో కూడ ఆమె మనస్సు సమాధానపడలేదు. అతనికి అనాథని కాపాడ్డం ముఖ్యమైన కర్తవ్యం. అందువల్ల ఆ 'సరసుడు' 'కోపగింపగా' 'విచారము చేయక' స్వీయ కార్యతత్పరుడై 'లేచిపోయెను.'

అతడు ఆమె బిడ్డలను అనాథశరణాలయంలో చేరుస్తాడు. ఆమెకు గాయాలు తగ్గిన తరువాత బిడ్డల్ని కలుసుకొని ఆమె ఒక ఉపాధ్యాయుడి దగ్గరకు వెళ్ళింది. తనపిల్లలకు చదువు చెప్పమని తరువాత 'కూలినాలిచేసి', తన ఋణాన్ని తీర్చుకోగలనని ఆమె పలికింది పేదవాడి నిజాయితీ ఆమె మాటల్లో వ్యక్తంచేశాడు కవి. కాని ఆ ఉపాధ్యాయుడు చాల సహృదయుడు

'నీ యుపాకృతుల్,
వలయునె? తప్పు సుమ్మిటుల
బల్కుట, వర్ణనకందరాని బి
డ్డల పయినున్న మోహమక
టా! పరికించు ననేక రీతులన్.'

అంటాడు.

తన మగపిల్లలారుగురిని ఆ ఉపాధ్యాయునితో పంపి మిగిలిన కుమార్తెతో ఒక చెట్టు నీడను ఆకలితో కూర్చున్నదామె. ఈ సందర్భంలో జాషువ తన అభ్యుదయ భావాన్ని అనితరసాధ్యమైన రీతిగా వెలువరిస్తాడు.

అభ్యుదయ రచయితలు చెప్పే వర్గ దోపిడి ఇక్కడ జాషువ శక్తిమంతంగా చెప్తాడు

'ఈ వనిత గంజి బువ్వ ఏ ధనవంతుని అమృత భోజనంలో కలసిపోయిందో, ఈమె పూరి గుడిసె ఎవరి శృంగార సౌధంలో మునిగిపోయిందో, ఈమె ముదుకపంచ ఎవని తెల్లని వస్త్రాలలో కలసిపోయిందో, ఎవడు ఈమె యొక్క, ఈమె కొడుకులయొక్క సుఖాన్ని దోచుకొన్నాడో' అని సమకాలీనమైన భావచైతన్యానికి వ్యాఖ్యానంచేస్తాడు జాషువ.

మళ్ళీ అనాథకి క్రూరత్వం ఎదురైంది. భోరున వానకురుస్తుంటే ఆమె తన శిశువుతో ఒక యింటి పంచలో నిలబడింది. ఆ ఇంటిలో [illegible]

సిన తన పెంపుడుకుక్క సేవ చేస్తూ, అనాథను వెళ్ళగొడతాడు. అంటే ధనవంతులకు పేదవాళ్ళు కుక్క కన్నా నీచంగా కనిపిస్తారన్నది జాషువా అభిప్రాయం. కాని అసహృదయతని వెన్నంటి సహృదయత ఉంటుంది ఆ యజమాని భార్య సహృదయురాలు, కరుణారసార్ద్రహృదయ, మాటకారి, చదువుకొన్నది. జాషువ ఈ కావ్యంలో అట్టడుగున పడిన జనులు విద్యావంతులు కావలసిన అవసరాన్ని కూడ ప్రధానంగా చెప్పదలచాడు అందుకే ఆమె తన బిడ్డల్ని ఉపాధ్యాయునికి అప్పగించింది

యజమాని 'భార్య చదువుకున్నది' అని చెప్పడంలో కూడ విద్యకున్న ప్రాధాన్యాన్ని కవి వెల్లడించడమే ఆమె అనాథకు భోజనము పెట్టి ప్రేమవర్షాన్ని కురిపించింది. ఈ సందర్భంలో వాన వెలిసిన వర్ణన జాషువ ఉపమాశక్తికి ప్రతిబింబంగా ఉంది.

'మగఁడు గొట్టిన రోదించి మానుకొన్న
పెద్దగయ్యాళివలె వాన వెలిసిపోయె
మమత లుడిగిన సన్యాసి మనసువోలె
గగన మండలంబెల్ల నిష్కళంకమయ్యె.

వాన వెలిసింది పేదరాలి బాధలు తొలగినాయి. ఆమెకు సహృదయత లభించింది కావ్యంలో చిట్టచివరి పద్యంలో ప్రకృతిని వర్ణిస్తాడు జాషువ సహృదయత చేత తృప్తిపొందిన పీడితుల భావాల్ని ప్రకృతి వర్ణనలో జాషువ వ్యంగ్యం చేసిన విధానం అత్యద్భుతం.

'ఆకలితో తూలే క్షేత్ర కన్య కడుపు చల్లగ వాని నీటిని భుజించింది. ఒక్క చిక్కిన కొండ వాగు వాన నీటికి ఉప్పొంగింది. 'ఆకలితో తూలు', బక్క చిక్కిన, ఈ క్రియలు ప్రకృతిలో మానవ చైతన్యాన్ని నిరూపించే జాషువా కవితా శిల్పానికి గీటురాయి. ఇట్లా లోకాన్ని సస్యశ్యామలం చేసే మేఘంతో మానవత్వాన్ని పోల్చి అదే లోకాన్ని రక్షించగలదని ధ్వనింపజేస్తాడు జాషువ.

ఈ కావ్యంలో కొట్టవచ్చినట్టు కనబడేది జాషువాకి ఒక సన్నివేశాన్ని, ఒక చేష్టని, ఆవేశాన్ని బొమ్మకట్టగల నేర్పు ఆ పేదరాలు బాటమీద నడుస్తుంటే ఆమె పరిస్థితిని ఇట్లా కళ్ళకు కట్టేట్టు చెప్తాడు.

'ఎడగాఁ బొమ్మని చీదరించుకొను వా
రీ వంక నా వంక నొ
త్తిడి సేయం గరమెత్తి మ్రొక్కుచు మహా
దీనంబుగాఁ బ్రక్కకున్
బుడుకల్ దానుఁదొలంగుచుం బెదరుచుం
బుత్రీ సమేతంబ కా
అడవిన్ దాటినయట్లు కష్టమున ర
థ్యల్ దాటి శీఘ్రంబుగన్'
త్రొక్కుడు బండిపై నడక
క్రొత్తగ నేర్చిన పోకిలా యొకం
డెక్కడనుండి యో యచటి
కేగుచు నంకెకురాని భ్రాంతితో
జిక్కులనందు భర్తవలె
జేతుల పట్టుఁదొలంగి క్రేళ్ళిడిన్
ముక్కున నెత్తురొల్కఁ బడి
పోయె గుభిల్లునఁ బేదరాలిపై

ఈ విధంగా డెబ్భై పద్యాల చిరుకావ్యంలో అనంతమైన మానవతా భావాన్ని ఆకాశాన్ని సీసాలలో బంధించినట్లు వ్యక్తం చేసి సమకాలీన సమాజానికి అరమానుషత్వంతో నిండిన సంఘానికి అమృత సందేశాన్ని అందించాడు జాషువ.

# తెలుగువారు - ఉర్దూ భాషా సేవ

శ్రీ వెలుదండ నిత్యానందరావు.

మహమ్మదీయుల ఫారసీ, హైందవుల ప్రాకృత అపభ్రంశ రూపమైన శౌరసేనీ భాషల కలయికచే నూతన భాష యొకటి జన్మించినది. జన్మస్థానమైన ఉత్తరభారతంలో స్థానం కోల్పోయి దక్షిణభారతంలో ముఖ్యముగా ఆంధ్రదేశంలో రాజభాషయైనది దక్కన్ పీఠభూమివాసు లెక్కువగా మాట్లాడడం వలన దీనికి 'దక్షిని" భాష అని పేరు వచ్చెను తెలుగు, తెనుగు ఆంధ్రము అని ఆంధ్ర భాషకు పేరులున్నట్టులే దక్షిని రేఖ్తా హిందవీ, హిందుయీ అని కూడ పేరులున్నవి

గోల్కొండ రాజులు దక్షిని భాషకు అగ్రతాంబూల మిచ్చారు 1 మల్కిభరాం అని ప్రసిద్ధిపొందిన ఇబ్రహీం కులీ కుతుబ్‌షా ఆస్థానమున ఫెరోజ్, మహమూద్ అను దక్షినీ కవిపుంగవు లిద్దరు ఉన్నటుల తెలుస్తుంది. ఫెరోజ్ కవి 'తౌసల్ నామా' యను కావ్యము రచించెనట. మహమూద్ కావ్యములు వెల్లడి కాలేదు.

మహ్మద్ కులీకుతుబ్‌షా స్వయముగా దక్షిని భాషలో పండితుడు ఈ రాజకవి 'మాన' అను కలము పేరుతో 'కల్లియాత్' అను ప్రౌఢకావ్యము వెలయించెను ఇతని రచనావ్యాసంగమంతా ఫారసీ, దక్షినీ భాషలలో 1800 పుటలు, 50,000 పంక్తులు గలిగిన కావ్య సంపుటములుగా హైదరాబాదు నుండి ప్రకటింపబడెను. సూఫీ మత సిద్ధాంతాలను, ఆముష్మిక భోగములం కాంక్షించి చేయు అల్లా భజనలు, తత్సంబంధమైన ప్రసంగములను గురించి మాత్రమే కల్గిన దక్షినీసాహిత్యాంగణములోనే యొక విప్లవాత్మకమైన మార్పు కొని తెచ్చెను. ఇతడు సరస శృంగార రస భావనా ప్రపూర్ణమైన కథారచనను, ఋతు, నదీనదాది ప్రాకృతిక వర్ణనలకు అనన్య సామాన్య ప్రతి

భతో దక్షిని కావ్యసీమలో ప్రప్రథమముగా ప్రవేశపెట్టెను

ఈ చక్రవర్తి జీవితగాథను 'వజీహా' కవి 'కుతుబెముష్తరీ' అను పేర పద్య కావ్యముగా వ్రాసెను దక్షినీ సాహిత్యంలో సత్యుత్తమ కావ్యముగా తలంచబడే 'సబ్రస్' వజీహా కృతియే ఇంకా ఈకవి పవిత్ర ప్రణయజీవులైన లైలా మజ్నూలగాథను 'లైలామజ్నూన్' అను పేర నావిష్కరించెను

గవ్వాసి అను నతడు 'తూతీనామ' యను కథలసంపుటి ప్రకటించెను ఇది పాలవేకరి కదిరీపతి రచించిన శుకసప్తతి కథల కనువాదము శుకసప్తతి కథలు తెలుగులో చాల ప్రచారము పొందిన గ్రంథము ఇంకా ఈకవి 'బదీయుల్ జమాల్,' 'సైఫుల్ ముల్కు' అను కావ్యములను రచించెను

'ఇబ్నెనిషాత్' కవి ప్రకృతి వర్ణనములలో నొకటైన వనవర్ణనపై ఒకగ్రంథమే రచించెను. దానిపేరు 'ఫూల్ బన్'

గోల్కొండరాజుల పతనానంతరము ఔరంగాబాద్ అధినేతయైన 'వలి' యను సుప్రసిద్ధ రచయిత ఈ భాషను ఢిల్లీనగరమునకు కొనిపోయెను అక్కడి ప్రజలు దీనిని 'ఉర్దూ' అని పిలిచిరి నాటి నుండి 'ఉర్దూ' అన్న పేరు స్థిరపడెను

అసఫ్ జాహీలు ఆంధ్రుల ఆంధ్రభాషను మంటగలిపి ఉర్దూభాషను అందల మెక్కించిరని చెప్పక తప్పదు వీరి కాలంలో ఉద్యోగార్థులు, విద్యార్థులు, రాజప్రాపక మర్థించువారు, ఒకరేమిటి సర్వులు ఉర్దూభాషను నేర్చుకొనవలసిందే వకీళ్ళు, ముక్తేదార్లు పట్వారీలు ఉర్దూభాషను కడు చక్కగా మాట్లాడేవారు నేటికి కూడ నలభైఏళ్ళు దాటినవారంతా ఇంచుమించుగా అందరు ఉర్దూలో వ్యవహారములు నడుపగల సమర్థులే

ప్రఖ్యాతిగన్న ఆంధ్ర మహాసభకు కార్యదర్శిగా పనిచేసి, ఆంధ్రోద్యమ నిర్మాణ దోహదకారులలో నొకడని పేర్గాంచిన శ్రీ ముందుముల నరసింగరావుగారు 'రయ్యత్' అను ఉర్దూపత్రిక నడిపిరి

భండారు శ్రీనివాసరావుగారు 'రహనుమా', వెంకటలక్ష్మారెడ్డిగారు 'ముహిబ్బెవతన్' లక్ష్మినారాయణగారు షరారె పత్రికలను నడిపిరి

దోమకొండసంస్థానాధీశులైన శ్రీరాజా రామేశ్వరరావుగారు ఉర్దూ-హిందీ, హిందీ-ఉర్దూ డిక్షనరీలు తయారుచేసిన ఘనులు వీరు భారతీయేతిహాసాలైన భారత రామాయణములను ఉర్దూ గద్యంలో ననువదించిరి వీరింకా 'ఉర్దూ సామెతల సంకలనం' ఆదిగాగల 25 గ్రంథములు రచించారు

షక్ (పల్లెర్ల శ్రీనివాసరావు ?) బేతాజ్ బాద్ షా (కిరీటరహితచక్రవర్తి) అను పేరుతో నవభారతనిర్మాత నెహ్రూ గారిని కీర్తించిన కవిత సుప్రసిద్ధము.

నేడు 'జాతీయసాహిత్య పరిషత్' కార్యదర్శిగా పనిచేయుచున్న శ్రీ భండారు సదాశివరావుగారు 1970 లో 'ఉర్దూ కవుల కవితాసామగ్రి'ని గూర్చి గ్రంథరూపమున తెలిపెను.

ఆంధ్రుల సాహిత్య చరిత్రమును డా॥ జీనత్ సాజిదాతో కలిసి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఉపాధ్యక్షులైన శ్రీ దేవులపల్లి రామానుజరావు గారు 'తారీఖే తెలుగుఅదబ్' అనే పేర ఉర్దూ భాషీయులకు పరిచయము చేసెను

డా॥ సి నారాయణరెడ్డి, దాశరథి ఉర్దూ భాషలోని సొబగులను అనువదించి తెలుగువారి కందించారు

శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు ఉర్దూ భాషలో గొప్ప విద్వాంసులు వీరు తెలుగు-ఉర్దూ మిశ్రశైలిలో గ్రామాధికారులపై నొక దండకమును రచించెను అందు ఉర్దూ పదములకు తెలుగు ప్రత్యయములను జేర్చి సరికొత్త పదబంధములను సురవరంవారు సృష్టించిరి.

'ఏమి గ్రాచారమో రామ నాకు, పట్వారి 'పోలీసు' 'పాటేలు' 'తాసీలు దారంటరో', మొద్దుమీనంట', తాలూకు దారంట, కచ్చేరి బంట్రోతులంటూ, 'అమీనుసాబు' యింకా 'తమాసైనహోద్దార్లు' వస్తారు. బేగారివాన్ని 'పకడ్లావు' మంటారు, బచ్చాలు వానింట సౌదా మసాలాలు పట్టిచ్చరమ్మంటు చెప్తారు. కోమట్లతో పీకులాట తప్పిందికాదయ్యా. వాళ్ళియ్యకుంటే 'దఫేదార్లతో' గుద్దులాడాలె, పాటేళ్ళు పెట్టల్ మరీగుడ్లు తేవాలె అలస్యమైతేను తుర్కాన 'చేదంట' గీదంట తిడ్తారు. 'మోజాలతో' యీపు వాయంగ కొడ్తారు. 'హుక్కాలు' తాగాలె మాకగ్గిపెట్టండి అంటారు మాచేత గాదంటే బర్తర్ఫు చేయిస్తమంటారు తైదంబలీ యింత పోయించరూ, దూపకూ చిట్టి రాయించమంటేను, కోపించుకా మేక చేదంటె 'లుచ్ఛాలఫంగంట' రోమే మొతిడ్తారు, యీ 'నౌకరీ' మాకు చాలంటె మమ్మొంగబెడ్తారు మాలాగ ఎట్టీలు మోస్తే తమాషా తెలుస్తుంది 'కానూను' సత్కెది మమ్మల్ని పీడించదాన్కేన . అట్లయితె కానూనుమాకైతె యేమైన ఉందా మరిలేద చెప్పండి. లేదంటే యీ 'నౌకరీ' మీరె చేస్కోండి

వ్యావహారిక భాషలో జానపదులకు అతి దగ్గరిశైలిలో వ్రాయబడిన పైదండకమును చాలవరకు సంక్షిప్తీకరించి వ్రాసినాను దండకములోని ఉర్దూ పదములు గుర్తింపబడినవి

ఉర్దూ సాహిత్య మున్నంతవరకు తన పేరును చిరస్థాయిగ ఉంచుకొ గల్గిన కవి గాలిబ్ ఇతడు పద్య గద్యోభయ రచనలందు ప్రవీణుడు ఉర్దూలో గజళ్ళను సాంప్రదాయమును నెలకొల్పెను. ఇతని గజళ్ళను ఆంధ్రుల ఆస్థానకవి డా॥ దాశరథి 'గాలిబ్ గీతాలు' అను పేర ననువదించెను ఉదాహరణ పూర్వక

సిద్ధాంత ప్రవచనము, 'సుకుమార, గాంధీ ర్యములతో భావవ్యక్తీకరణ 'గాలిబ్ గీతాలు' ఒల్లోని ముఖ్య విశేషములు ఇంకా దాశరథి మీర్, జఫర్ ల కవితలను కొన్నింటిని తెలుగు చేసెను

నవ్యాంధ్ర ఉర్దూ కవులలో అమ్జద్ స్థానం చెరిగిపోనిది భాగ్యనగర నివాసి యైన ఈకవి 1961 లో చనిపోయెను ముసల్మానుల మతధర్మమైన సూఫీతత్వ మును నరనరములలో జీర్ణించుకొని, దానినే రూబాయీల రూపమున కాగి తముపైని పెట్టెను. ఈతని కవిత్వ మతి నిరాడంబరమై చిన్న చిన్న పదములలో నుండి అతి క్లిష్ట వేదాంత రహస్యములను వెదజల్లుచుండును ప్రస్తుతము వరంగల్లు నుండి వెలువడుచున్న 'సాధన' మాస పత్రికకు సంపాదకుడుగా పనిజేయు చున్న శ్రీ సదాశివ అమ్జద్ కవి రూబా యిల ననువదించెను సదాశివ అనువాదము కూడ అమ్జద్ కవితవలెనే భావాన్వయ కాఠిన్య రహితముగా నుండును

ఎన్నో ఏళ్ళనుండి అంధవిశ్వాసము లతో బూజుపట్టిపోయిన ప్రజాహృద యాలందు నూతనాశయములను రేకెత్తిం చిన కవి ఇక్బాల్ ఇతని కవితలను ఆచార్య రాయప్రోలు సుబ్బారావు తెని గించిరి వీరి అనువాదము స్వేచ్ఛగా, వివరణాత్మకముగా, మూలమునకే మెరు గులు దిద్దు విధముగా నున్నది ఇక్బాల్ రచనలలో నొకదానికి రాయప్రోలు వా రొనర్చిన అనువాద మిట వ్రాసెదను

'అలుగక విందువేని ని జ మా డె ద బ్రాహ్మణవర్య! నీదు దేవళమున నున్న మూర్తుల ప్రభావ మభావమునందె చాల ప్రావడిన కతాన, ద్వేషగుణ పాఠము లబ్బెను నీకుగూడ, మాశిలల సమీపమందె మెలచెన్ గురుపీరము సైత మావలన్.

భావము మాత్రమే గ్రహించి నేను చేసిన అనువాదము కూడ పరికింపుడు

'పూజరీ! విను మలుగక, పోయె మహిమ ప్రాతదగుటచే గుడిలోని ప్రతిమకు, వారి నేర్పె ద్వేష మనూయయు నీకు, వారి ని వదిలితిని నేను, నీతినే వదలితీవు'

ప్రప్రథమ ఉస్మానియా తెలుగు M A విద్యార్థియైన శ్రీ పల్లా దుర్గయ్య గారు డా॥ మొహిఉద్దీన్ ఖాదిరిగారు రచించిన గోలుకొండ కథల ననువదించిరి.

ఆంధ్రపితామహ మాడపాటి హను మంతరావుగారు ప్రేమచంద్ రచనలను తొలుదొలుత ఆంధ్రీకరించిరి ప్రేమచంద్ 'బడే ఘర్ కీ బేటీ' అను కథను వేమూరి ఆంజనేయశర్మగారు, 'కఫన్'ను 'పాడె బట్ట' అను పేర బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రిగారు మరియు వల్లభ్ గారు అనువ దించిరి.

ప్రఖ్యాతిగన్న ప్రేమచంద్ 'శేరుం బావు గోధుమలు' కథ చావలి రామ చంద్రరావుగారు కడు సమర్థతతో సన్నివేశకల్పనలలోను, పాత్రచిత్రీకరణ మందును తెలుగు దనమునకు భంగము రానీక మూలానుసారముగా తెనిగించెను. ఇంకా వీరు ప్రేమచంద్ పోటాపోటి, లాటరీ, ఆత్మారామ్ ప్రేరణ మున్నగు కథలను అనువదించిరి

లల్లన్ గారు 'మనస్తత్వ' మనుపేర ప్రేమచంద్ నాల్గుకథలను తెనిగించిరి ఇంకా విశ్వప్రసాద్ ఛాయేశ్వర్, సోమ యాజులు మున్నగు ఆంధ్రులెందరలో ప్రేమచంద్ సాహిత్యమును తెనిగించిరి

కృష్ణచందర్ గారి కథలను వేమూరి ఆంజనేయశర్మ జ్ఞానేంద్ర, చంద్రమౌళి శాస్త్రిగారు అనువదించిరి

చంద్రమౌళిశాస్త్రిగారు, ఆంజనేయ శర్మ గారు రషీద్ జాహా, అక్బర్ హుసేన్, ఇబ్రహీంజలీస్, సాదత్ హసన్, ముం తాజ్ గారలకథలను తెలుగువారి కందిం చిరి

భారత మాజీ రాష్ట్రపతి డా॥ జాకీర్ హుసేన్ ... ఇతడు ...

వేత్త, చిన్నారి బాలబాలికలను దృష్టి యందుంచుకొని 'అబ్బూఖాన్ మేకమరి 14 కథలు' ఉర్దూలో రచించిరి దీనిని ఆంజనేయశర్మగా రనువదించిరి.

శ్రీ పల్లపురెడ్డి బుచ్చారెడ్డి గారు 'ముక్తగీతిక' లను పేర వివిధ ఉర్దూ కవుల గజల్సను సరళ సుందరముగ తేటగీతిక లలో ననువదించినారు

శ్రీ కె యస్ లక్ష్మారెడ్డిగారు 'జ్ఞాన పీఠ అవార్డ్' గ్రహీత ఫిరాక్ గోరక్ పూరి గారి 'గులేనగ్మా' అను కావ్యములోని గజల్సను తేటతెనుగులో గీతికలుగా ననువదించినారు.

''సాకీ! తోణకెడు మధుపూర్ణ చషకమేడ స్మృతి చషకమాని పెదవుల సీత్కరింతు''

ఉర్దూలో మధుపాత్రిక తెచ్చు పడ తిని 'సాకి' యందురు గతనాళులలో విరహి మధుపూర్ణ చషకమును గ్రోలి ఆనందించినాడు. కాని నేడు ఆ స్థితి మృగ్యము పూర్వస్మృతులను నెమరువేసు కొనుచున్న అతని మనస్థితికి దర్పణం పట్టినది ఈ ద్విపాద గీతం

శ్రీ కె.యస్ లక్ష్మారెడ్డిగారు గాలిబ్ గీతాలనుకూడ ననువదించినారు. దాశరథి గారు గాలిబ్ లో పూర్తిగా అంతర్లీనమై పోయి రచించారు. అందుకే అక్క డక్కడ కొన్ని ఎబ్బెట్టుగా కనిపిస్తాయి. ఉదా॥

కుచ్ ఖటక్తా థా మేరే సీనేమె లేకిన్ ఆఖర్
జిస్ కో దిల్ కహ్ తే థే సో తీర్ కా పైకాఁ నిక్లా

ఏదో వక్షమ్మునందు బాధింపదొడగె
హృదయమా! కాదు బాణంపు టినుప ముక్క (దాశరథి)

వక్షములోనె యుండు హృదయము (గుండె) గుచ్చుకోవడమేమిటి? అది బాణంపు ...

ఉర్దూసంప్రదాయములలో నేవిధంగా నున్నను తెలుగు సంప్రదాయములకు దూర ముగా నున్నది.

దీనినే శ్రీ కె. యస్ లక్ష్మారెడ్డిగారు కొలదిగా మార్పులొనరించి ఈ విధముగా రచించారు.

గుండియ కలుక్కుమని గ్రుచ్చు కొనుచునుండ
ఏమొ యనుకొంటి మరుని శిలీముఖమ్ము
ఇది బహుసమంజసముగా నున్నది.

మరియొకటి —

స్మృతిని ఏపాట లాధర మెదలినదియొ
ముద్దులే ముద్దులౌర ! రేనిద్దురెల్ల
(లక్ష్మారెడ్డి)
ఎవతె అధరచక్రమును భావించినానో
రేయి మదినెల్ల చుంబనశ్రేణి వెలసె
(దాశరథి)

అధరమునకు చక్రమును ఉపమానము చేయుట తెలుగులో కవి సమయము కాదు. కాని దాశరథి నూతనత్వంకోసము ప్రయోగించాడు.

ఇది చాల చక్కని ప్రయోగము. పాటలాధర, పల్లవాధరలతో విసిగెత్తి పోయిన సాహిత్యపాంథులకు అధరచక్ర మొక చలివేంద్రము కాగలదు.

శ్రీ బిరుదరాజు రామరాజుగారు, డా॥ కె గోపాలకృష్ణారావుగారుఉర్దు-తెలుగు, తెలుగు - ఉర్దు నిఘంటువుల తయారు చేశారు. శ్రీ గోపాలక్రిష్ణారావు గారు చక్కని ఉర్దూ విద్వాంసులు

వీరు "తెలుగుపై ఉర్దూ పారశీకముల ప్రభావము"అను చక్కటి విమర్శనాత్మక మైన గ్రంథమును రచించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతిని గ్రహించారు.

మా తండ్రిగారైన శ్రీ వెలుదండ రామేశ్వరరావుగారు కూడ ఉర్దూభాషా కోవిదులు వీరు ఇటీవలనే ఖాన్ గారి "నూరెఖా తేపాహా"ను ఆంధ్రీకరించారు. ఇది "ఈశ్వరస్తుతి" అను శీర్షిక క్రింద 16-11-1979 సమాలోచనలో ప్రచురింపబడినది

తెలుగువారికి ఎక్కువగా ఉర్దూభాష రావడానికి ప్రధాన కారణం వారి పాఠ్యాంశాల్లో ఉర్దూ ఒక సబ్జెక్టుగా ఉండడమే నని చెప్పవచ్చును.

— ** —

పాదపీఠికలు

1 "గోల్కొండ సుల్తానులు తెలుగువారు కారు" అని నన్ను విమర్శించారు కొందరు పండితులు. కాని వారు పాలించినది తెలుగు రాజ్యము. ఉర్దూ రాజభాషగా నున్నను తెలుగునకు సముచిత గౌరవమిచ్చి, తెలుగుకావ్య కృతి భర్తలైనారు. అట్టి గోల్కొండ రాజులను తెలుగువారు కారనడం సమంజసంకాదు. అందుకే ఇక్కడ నేను వారిని తెలుగు వారినిగానే భావించి పేర్కొనడం జరిగినది

2. రాయప్రోలు వారి అనువాదము లోని ప్రథమ, ద్వితీయ పాదములు మూలము ననుసరించియున్నవి. కాని మూడవ పాదంలో "ద్వేషగుణ పారము లబ్బెను" అని వ్రాశారు. మూలంలో "మీ మూర్తులం నీవు ద్వేష భావములు నేర్పాయి" అని యున్నది. 'అబ్బెను' అనగా సహజంగా రావడమవుతుంది అంతేగాని ' నేర్పుట' ఎలా అవుతుంది ? ఇక చివరిపాదంలో పూర్తిగా 'మూలాతిక్రమణం' జరిగినది.

రాయప్రోలువారిని విమర్శించే స్థాయికి నేను చేరుకోలేదు. నాయీ మూర్ఖ సాహసాన్ని పెద్దలు మన్నిస్తారని వేడుకొనుచున్నాను

మూలంలో "దేవుడు" అని మాత్రమే యున్నది కాని నా యనువాదంలో హరి, హరుడు అని ప్రయోగించాను ఇది కేవలం ఛందస్సుకోసం మాత్రమే అంతేగాని శివకేశవులకు సంబంధించి కాదు విజ్ఞుల పరిశీలనార్థం మూలంకూడ పొందుపరిచెదను.

"సచ్ కహెదూం ఏబ్రహమిన్ గర్ తూ బురానమానె
తేరేసనమ్ కదోంకే బుత్ హోగయే పురానె
అపోంసే బైర్ రఖ్నా తూనే బుతోంసె సీఖా
జంగోజదల్ సిఖాయా వాజ్ కో భి ఖుదానే
తంగ్ ఆకె మైనె దీరోహరమ్ కో ఛోడా
వాజ్ కా వాజ్ ఛోడా తేరే ఫసానే

(ఈ కవితను విడమర్చి వివరించిచెప్పిన శ్రీ కె. యస్ లక్ష్మారెడ్డి యమ్ ఏ గారికి కృతజ్ఞతలు)

ఆధారగ్రంథములు

1 తెలుగు - ఉత్తర భారత సాహిత్యములు - ఇరివెంటి కృష్ణమూర్తి & భీమసేన్ నిర్మల్

2 మనచరిత్ర - సంస్కృతి - 1960 OSM M A విద్యార్థుల ప్రచురణ.

3 తెలుగుపై ఉర్దూ పారశీకముల ప్రభావము - డా॥ కె గోపాలకృష్ణారావు.

4 గులేనగ్మా (కుసుమ గీతాలు) గాలీబు గీతాలు - కె యస్. లక్ష్మారెడ్డి గారి అముద్రితానువాద కావ్యాలు.

5. గాలీబు గీతాలు - దాశరథి

6 సమాలోచన 16-11-79 సంచిక మరికొన్ని పుస్తకములు.

— శుభమ్ —



# *-* దేవయాని *-*

( ఏకాంకిక )

– శ్రీ పాలకోడేటి జగన్నాథరావు, ఎం. ఏ



సమయము ఉషఃకాలము.

రంగము వెనుక : శుక్రాచార్యుని యాశ్రమము. వేదమంత్ర పఠనము సుస్వరమై యాశ్రమమంతట ప్రతిధ్వనించుచుండును. జిలిబిలి పలుకులతో నాశ్రమ తరుశాఖలపై నుండి చిలుకలు వటువుల వేదమంత్ర స్వరములకు శ్రుతికలుపుచుండును తరువులపై గల వివిధ పక్షి జాతులు రొద చేయుచుండును.

రంగము శుక్రుని యాశ్రమ కుటీర ప్రాంగణము. అందు దేవయాని ఝుమ్మని మ్రోయుచు వ్రాలు తుమ్మెదలను వామ హస్తముతో ఒయ్యారముగా అదలించుచు ఏకాగ్రచిత్తయై మందార మాలను కట్టుచుండును.

(కచుడు వినీతుడై ప్రవేశించును)

కచుడు చెల్లీ! ఆజ్ఞనొసగుము నీ సోదరుడిదే వెడలి చియున్నాడు

దేవయాని (ఆశ్చర్యముగ) దేనికి ?

క దేవలోకమునకు పోవుటకు.

దే : (ప్రశ్నార్థకముగ) అంత తొందర యేల ?

క అధిగత విద్యాపూర్ణుడనగు నన్ను దేవలోకము అట్టులం చాచి పిలుచుచున్నది.

దే · (బేలతనముతో) అట్లని యీ దేవయానిని విడిచి పోయెద నందువా ?

క (విచారముతో) సోదరీ! నిన్ను వీడి వెడలిపోవుటకు నాకును విచారముగ నున్నది కాని విద్యార్థినై వచ్చిన నేను విద్యాభ్యాసానంతరము కూడ నిందుండ దగునా ? కావున నేను దివికి పోవక తప్పదు

దే కాదు దేవతాచార్య పుత్రా! లబ్ధ సంజీవనీ విద్యాగర్వితుండవై నాకిచ్చట నేమి పని యని నన్నును ఈతపోవనమును వీడి వెడలి పోదలంచితివి కదూ కాని నిన్ను విడలేక నావలె ఈ తపోవనము యజ్ఞధూపంబుల నెపంబున విరహ దుఃఖమును ప్రకటించుచున్నది. అదిగో చూడుము.

క (స్నేహ స్నిగ్ధమయిన కంఠముతో) ఆచార్యపుత్రీ! స్నేహస్నిగ్ధములైన నీహృదయ భావములను గ్రహింప లేనంతటి విరస హృదయుడను గాను. కాని దశ శతవర్షములు గురు శుశ్రూష గావించి సకల విద్యలతోపాటు అపూర్వ సంజీవనీ విద్యచే శోభితుండయిన తమ బిడ్డను ఇన్నాళ్ళకు మక్కువతో అక్కున చేర్చుకొనగలుగు భాగ్యము సమీపించు నీ సమయమున ఉత్ఫుల్ల హృదయారవిందులయి చూచుచున్న నా తల్లిదండ్రు లదిగో చూడుము. నే నిక్కడనే యుండి వారి కాశాభంగమును కలిగింపు మందువా ? తమ యాచార్య పుత్రుని రాకకై యింతకాలము నిరీక్షించుచునే డానందాతిశయముతో ఆహ్వానించుచున్న దేవతలదిగో చూడుము, దుందుభి ధ్వనులచే నన్ను వేగముగా రమ్మని హెచ్చరించు చున్నారు వినుము.

దే (నిర్లక్ష్యముగా) వినుచున్నాను కాని 'జాతివైరము వలన రాక్షసులచే మరణించిన మీ కచుడు ఇక్కడ లేడు అమోఘ సంజీవనీ విద్యాశోభితుండగు శుక్రునిచే పునర్జీవితుడైన కచుడు మా బిడ్డ. అతడింక మీ దివికి రాడు' అనుచు తపోవనము వేదధ్వనుల నెపంబున నిర్జరులకు సమాధాన మిచ్చుచున్నది వినబడుటలేదా ? కావున నీవిందు నిశ్చయముగా నుండవచ్చును

క (కంఠమున వెడలిపోవలయునను తొందరను ధ్వనింపజేయుచు) గురుపుత్రీ! అట్లనకుము. విద్యాభ్యాసానంతరము గురుకులములో విద్యార్థి యుండరాదుకదా అందు కని విబుధుడవైన నీవు ప్రాపంచిక బంధనములను పెంచుకొనక విడివడి దేవలోకమునకు రమ్మనుచు నందన మందార పారిజాతాది దివ్యకల్పవృక్షములు తమ శాఖాగ్రములచే సైగలు చేయుచు పిలుచుచున్నవి కావున నన్ను నివారింపకుము

దే అపూర్వ సంభాషణ చణా! దేవతలయినను జన్మ రాహిత్యమునకై కర్మ భూమియయిన యీ భారత భూమిపై జన్మింపక తప్పదు. ఇహపరార్థములు ఈ భూమిపై తక్క మతియే లోకమునందును కూడ సాధ్యములు కావు కావున నీ విందే యుండి ఇహపరార్థములను సాధించుకొనుము.

క (సంభ్రమముతో)ఆచార్యపుత్రీ! నీవన్న మాటలు . .

దే (వెంటనే అందుకొని) సత్యములే అయినను నేను దేవలోకమునకే పోయెద నందువు అంతియేనా ? సరస హృదయా! నీ విరహమును సహింపలేని నా హృదయము వోలె ఈతపోవన భూమి యంతయు ఉషఃకాలారుణ కాంతులతో రాగరంజితమై యెంత సుస్నిగ్ధ మగుచున్నదో చూడుము. ఇకనైనను ఈ దేవయాని కోరిక మన్నింపు మని

ఆదిగో! వనలక్ష్మి వేణుధ్వనుల నెపంబున ప్రార్థించుచున్నది. కాని స్వర్గమునకే పోయెద నన్న నీ మారమును జూచి తపో వనలక్ష్మి గాలికిరాలు పండుటాకుల నెపంబున కన్నీళ్ళను విడుచుచున్నది. వీని నన్నింటిని జూచియు నీ మనసు కరగుట లేదా ?

క (కంఠమున దేవయానిని అంగీకరింప జేయుటకై మార్దవమును ధ్వనింపజేయును) లేకేమి సోదరీ! ముక్కోటి దేవతల కధీశ్వరుడైన యింద్రుడు సహస్ర నేత్రములతో నాకై నిరీక్షించుచున్నాడు.

దే సమస్త రాక్షసాధీశ్వరుల కిరీట కోటి మాణిక్య కాంతులు ప్రతిబింబించు చరణ యుగనఖ మయూఖ రేఖా విలాసుండగు శుక్రుని యనుంగు పుత్రి దేవయానియు శత సహస్ర ప్రణయ మనోనేత్రములతో సంతతము నీ పొందు కొరకై వీక్షించుచున్నది

క కాదు సోదరీ! దేవత లెల్లరు నా రాకకై యెదురు చూచి యనిమిషులయిరి ఇంక నన్ను నివారింపకుము

దే (సోత్కంఠముగ) నిజము నిజము నీవుపోయి వారి యనిమిషత్వమునకు భంగము కలిగింపకుము నీవిందే యుండి తృతీయ పురుషార్థవంతుడవు కమ్ము

క (ఆశ్చర్యముతో ఆత్మగతమున) ఏమి !! ఈనాడు దేవయాని మాటలు విపరీతభావ గర్భితములుగా నున్నవి (ప్రకాశముగ) దేశికాగ్రగణితనయా! ఇంక నీ ప్రతిభాషణములను వీడి నాకనుజ్ఞ నిమ్ము నాకై త్రిదివ మంతయు స్వాగత మిచ్చుటకై నందన మందార పారిజాతాది పుష్పమాలలను చేబూని నిరీక్షించుచున్నది

దే (శిరమువంచి) ఈ చరణ దాసియు తన హృదయనందన మందార పుష్ప మాలాహస్తయై నీ కంఠము నలంకరించుటకై వేచియున్నది. మన్నించి అనుగ్రహించుము ఆర్య పుత్రా!

క (సంభ్రమముతో) ఆ! ఏమంటివి సహోదరీ! చరణ దాసి ననియా ?

దే (సిగ్గు నభినయించుచు) అవును అనుగ్రహించుము

క (సంభ్రమముతో) సోదరీ! ఏమి నీ విపరీత ప్రతిభాషణము! నీవే మాటలాడుచుంటివా ? లేక నేనే కలగనుచుంటినా ? ఆచార్య పుత్రీ! విద్యాలయము ఒక విద్యాకుటుంబము. అందలి అధ్యాపకుడు ప్రత్యక్షమయిన పితృమూర్తియే. అయనకు తన శిష్యులందరు పుత్రతుల్యులే. కావున ఆయన శిష్యులు పరస్పరము భ్రాతృతుల్యులు. అందుచే గురుపుత్రి వయిన నీవు నాకు సోదరి వగుదువు అదియునుగాక అసూయా పరులయిన రాక్షసులు నన్ను ముమ్మారు వధింపగ కనికరించి తండ్రిచే పునర్జీవితునిఁ జేయించి ప్రాణదానము చేసితివి కాన నాకు తల్లి వగుదువు. కావున మన పవిత్ర భ్రాతృభావమును శృంగార దూషితము గావింపకుము.

దే భావనాగతమయిన వావి వరుసలు కేవలము కల్పితములు అనురాగ హృదయుల మధ్య వానికి తావు లేదు. అయినను మన మిరువురము ఏకోదరులము కాము కదా ?

క (కోపముతో) రాక్షసాచార్య పుత్రీ! ఇంక నీ విపరీత ప్రతిభాషణములు చాలింపుము. నీవిపుడు చెప్పినది యాటవికుల లక్షణము భావనా గతమయిన వావివరుసలే ఆటవిక స్థితులలోనున్న స్త్రీ పురుషుల కామ తీవ్రతకు సంకెలలు వేసి నాగరకులుగా దిద్దినవి కావున నాగరక సంఘమున కామ సంబంధమైన పశువాంఛ తొలగి ప్రశాంత స్థితి యేర్పడినది ఆ భావన వలననే పరస్త్రీ లందరు మాతృమూర్తులుగా ఆదరింపబడుచున్నారు అది యట్లుండనిమ్ము మనమిరువురము ఏకోదరులము కామనుమాట సత్యదూరము. నీతండ్రి యుదరమునందు భస్మీభూతుడనై యుండగా ఆతని సంజీవనీ విద్యాప్రభావమున పునర్జీవితుడనై యాతని యుదరమునుండి వెలువడిన నేను నీకు ఏకోదరుడను గాక ఏమగుదును ?

దే (నిర్లక్ష్యముగ) బృహస్పతినందనా! నీ హేతువాదము విరాగులు, నీరసహృదయులు చెప్పుకొని తృప్తిపడునట్టిది మాత్రమే కాని దానిని ప్రణయ మనస్కులు - సరస హృదయులు కలనైన స్మరింపరు సుమా.

క (ఆత్మగతమున) ఔరా! ఈ దేవయాని వితండవాదమునకు దిగుచున్నదే ఈ మెకు కనువిప్పును కల్గించు టెట్లు ? ఈమెను యుక్తిచేతనే జ్ఞానమార్గమునకు మరలించెదను.

(ప్రకాశముగ) నీతిశాస్త్ర ప్రణేతృతనయా! నీవన్న ప్రణయమనస్కులు, సరసహృదయులు, పరస్పరము అనురాగబద్ధులయినపుడు కదా వారిమధ్య వావివరుసలు లేక పోవుట ?

దే అవును

క అయిన నందొకరు విరక్త హృదయులయినచో ?

దే నీ వేదాంతమును వల్లించుకొందురు

క అట్లయిన నీయం దనురక్తుడను కాననువిషయము నా మాటలను బట్టి అర్థమగుట లేదా ? కావున నాకు దయతో సెలవిమ్ము స్వర్గలోకమునకు పోయెదను.

దే (పరిశీలనగా జూచుచు) ఏమనుచుంటివి? నన్ను ప్రేమింపలేదనియా? నారీ జనమనోవశీకరణవచో నిపుణా! నన్నును నా ప్రేమను పరీక్షించుటకు పలుకు ఈ మాటలు చాలింపుము ఒక మాట నడిగెదను చెప్పుము. నిజముగా నా యందు నీవు విరక్తుడవయినచో వనములలో నీకు కనబడిన ప్రతిపుష్పమును తెచ్చి అపురూపముగా వర్ణించుచు ఏల నాకు బహూకరించెడి వాడవు?

క స్త్రీలు పూలనిన వేడుక పడుదురు కావున

దే అయిన నేను కోరకయే తెచ్చియిచ్చునంత యవసర మేమి వచ్చినది? అది యటుండనిమ్ము శారద రాత్రులలో వేణుమతీ నదీ తీరమున పోకమ్రానుల చీకట్లలో కూర్చుండి ఉత్తుంగ తరంగములపై శరజ్జ్యోత్స్నలకళ త్రళలను చూచుచు ఏకాగ్రచిత్తనైయున్న నాకడకు పిల్లివోలె వెనుకనుండి వచ్చి ఆనంద పారవశ్యమున అర్ధనిమీలిత నేత్రములతో నన్ను జూచుచు దేవగాంధర్వము నేల యాలపించితివి??

క దేవగాంధర్వమును నీకును నేర్పవలయు నని.

దే (సస్మితముగ) అందుకొఱకే కాబోలు పాపము నీవు దివినుండి భువికి విద్యార్థివై వచ్చితివి మఱి యీ మాటల కేమి చెప్పెదవు? నీ రెండలో సాయంసమయమున విలాసార్థము తపోవన వృక్షములకు నీరు పోయుచున్న నన్నుం జూచి యపుడే వనమునుండి హోమధేనువులను తోలుకొనివచ్చుటచే మిగుల బడలిక చెందియు; మదీయ కటిన్యస్త బాహులతా పరివేష్టిత ఘటంబును గైకొని నీరుపోయు నెపంబున మదీయ బాహులతా పరిష్వంగ సుఖంబును తద్ఘటంబునకు దూరంబు చేసి నీవే యేల గ్రహించితివి?

క (చిరుకోపముతో) కుమారీ! నేను నీయందు సోదరీ భావముతో చేసిన పనులన్నింటిని రాగముతో చేసినవిగా భ్రమించి నీవు నీవే మోసపడితివి. కావున 'కామీ స్వతాం పశ్యతి' అను పెద్దలమాట నీ యెడల సార్థకమయినది. ఇందు నా దోష మేమియును లేదు.

దే (సాధిక్షేపముగ) రోషముతో ఔనౌను. శత్రుపక్షాచార్యపుత్రా! నీ శుష్క ప్రియములను నమ్మి నేనును నీ నక్క వినయములను జూచి నా తండ్రియు నిజముగా మోసపోయితిమి.

ఏమి నీ వాక్చతురత!! నేనే మోసపడితి ననుచుంటివా? అయిన నేనడుగు ప్రశ్నలకు సమాధానమును చెప్పుము.

ముకుళిత హస్తగత రత్నము కాంతి రేఖలను వెదజల్లునట్లు నీ హృదయము ప్రణయ కాంతులను ఆవిష్కరించి ఎన్నిసార్లు మదీయ ముఖమున ఆనందరేఖలను అంకురింపజేయలేదు?

ఆ సమయమున నా యధరోష్ఠముపై హృదయ రాగము రంజిల్లి విరిసిన సుందర దరహాసములను గాంచి నీ మోమెన్ని మారులు ప్రఫుల్ల సహస్రదళ పుండరీకము కాలేదు?

త్వదీయ మనోభావము గుఱింగిన నేను బిడియంబున తటాలున లేచి సమీప లతానికుంజముల మాటునకు పోవుచుండగ నా మేని వంపులను జూచుచు పరవశుడవై యున్న సమయమున 'శిష్యా! ఎక్కడుంటివి? ఇటురా!' అని పిలుచు నా తండ్రి మాటలను విని ఉలిక్కిపడి తెచ్చుకోలు గాంభీర్యమును ముఖమున కలికించుకొని నా తండ్రి కన్న మాఱులు దొరకిపోలేదు? మఱి .. ..

క (ఆవేశముతో) చాలింపుము నీ భ్రాంతిమంతములయిన మాటలు ప్రేమ పిచ్చిలోపడి వాత్సల్యపూర్ణము లయిన నా పనులన్నియు ప్రేమ చేష్టలని భ్రాంతిపడి నీవొక స్వప్న లోకమును సృజించుకొంటివి. ఇకనైనను నీ వా స్వప్నము నుండి జాగ్రదవస్థకు రమ్ము.

దే నిగూఢహృదయా! ఇంకను నీవు పరీక్షావాక్యములచే నన్ను ఏల బాధించెదవు? దయతో నా యందు సుముఖుడవై నన్నర్థాంగిగా కరగ్రహణము గావింపుము

ఉ॥ నీవును బ్రహ్మచారివి వి
　　నీతుడ నేనును కన్యకన్ మహీ
దేవ కులావతంస! రవి
　　తేజ! వివాహము నీకు నాకు మున్
భావజ శక్తియైన యది
　　పన్నుగ నన్ను పరిగ్రహించి సం
జీవని తోడ శుక్రుదయం
　　జేయుము నాకు ప్రియంబు నీ యెడన్.

(అనుచు చేతిలోని మందార దామమును కచుని కంఠమున వేయబోవును.)

క (రెండు హస్తములతో దేవయానిని వారించుచు సోదరీ! ఏమి యీ అత్యాచారము. మతిభ్రమించినదా యేమి! (ఆత్మగతమున) హా! హతవిధీ! ఈ సమయమున నేనేమి చేయవలయును? ఇంక కొంచెము సమయ మిందే యున్నచో ఈ దేవయాని ఏమి యత్యాచారము చేయునో! వెంటనే యిందుండి నిష్క్రమించెదను (ప్రకాశముగ) దేవయానీ!

నీకిది తగదు నాయందు విరక్తురాలవు కమ్ము నన్ను మరచి పొమ్ము ఇదే వెడలిపోవు చున్నాను ఇంక సెలవు.

(కచుడు నిష్క్రమింపఁ బోవును)

దే (కోపావేశముతో) శాస్త్ర విద్యాశ్మ సన్నిభ హృదయా! వికసిత ప్రణయ హృదయారవింద భ్రకచా! కచా! పారిపోవుటకు ఉద్యమించుచుంటివే? ఎంతచక్కని నీరసమయిన యూహ కల్గినది వనిత తనంత తాకలచి వచ్చి తన హృదయ ప్రణయ మధువును గ్రోలుమని యొక పురుషున కర్పించుకొ యన్న నాపురుషుకు ఏ-డో తాను బహుసహస్ర సహస్ర వర్షములు ప్రేమారాధన చేసె సాధించిన తపః ఫలమని భావింపవలె నని ఎఱుంగని యవివేకివి అట్టి నీకు నా హృదయము నర్పించి నేనే యవివేకిని నయితిని

త అందులకే యిప్పుడయినను వివేక మార్గమున పయనింపుము

దే తప్పక పయనింతును వినుము. ఏఱును దాటుటకై వచ్చిన పాంథు డొకడు నావికుని మర్యాదతో ఓడమల్లయ్యా అని పిలిచెనట. ఆ మాటలోని శుష్క ప్రియమునకు ఉబ్బిపోయి నావికు డా పాంథుని ఏఱుదాటించి ప్రతిఫలమును కోరగా బోడిమల్లయ్యా పోవయ్యా అని జారుకొనె నట. ఆ పాంథునివలె నీవును ఇంతకాలము నాకు శుష్కప్రియములు చెప్పి సంజీవనీ విద్య లభించిన పిమ్మట ఈనాడు నాకు శూన్య హస్తములను చూపి పోవుచున్నావు.

నన్ను మోసగించి సంగ్రహించుకొని పోవుచున్న సంజీవనీ విద్యను నీకు దక్కనిత్తునా? ఓ నారీజన మనోహరకా! కచా! నీకు సంజీవనీ విద్య ప్రయోగ దశయందు నిష్ఫలమగును గాక. అమోఘ వచస్క యగు ఈ దేవయాని శాపము అప్రతిహతముగా చెల్లును గాక

క (ఆత్మగతముగ) ఘోర! ఈ దేవయాని యెంతటి క్రూర శాపమును నిచ్చినది దశశత వర్షములు గురుశుశ్రూష గావించి పలుమారులు రాక్షసులచే హతుండనగుచు పునర్జీవితుడ నయి సంపాదించిన విద్యాధనము ఒక్కక్షణమున దేవయాని శాపానలమున దగ్ధమయిపోయినదే? ఏమి యీ విధివైపరీత్యము? ఇపుడు నేను వివేకముతో వర్తించుట యుక్తము.

(ప్రకాశముగా) చెల్లీ! దేవయానీ! భగ్నమనోరథాగ్ని పై లేచిన నివురువంటి నీ శాపమువలన క్రమముగా నీకోపాగ్ని చల్లారును గాక. ఇంక నీ హృదయమున పవిత్రభావము లుదయించును గాక!

చెల్లీ! నీ యన్నను అల్పవచస్కునిగా తలంపకుము. వినుము. నీవు పలికినట్లు సంజీవనీ విద్య నాకు ప్రయోగ కాలమున నిష్ఫలమే యగుగాక కాని నాచే నుపదేశమును పొందినవారికి మాత్రము ప్రయోగ కాలమున అమోఘమై సఫలమగును గాక

నీతి శాస్త్రాచార్య తనయా! కామాతురవై యిట్లు నీతి బాహ్యమైన పనికి పూనితివి కావున బ్రాహ్మణుడు నిన్ను వివాహ మాడకుండును గాక.

(అనుచు కచుడు నిష్క్రమింపబోవును. ఇంతలో శుక్రుడు తెరలోనుండి బయటకు వచ్చును.)

క (శుక్రుని గాంచి సంభ్రమముతో) ఆచార్యదేవులకు నమస్కారములు.

శు (వాత్సల్యముతో) కుమారా! ఆశీర్వాదములు. అమోఘ సంజీవనీ విద్యాశోభితుండవగు నీ ప్రయాణ మార్గములు మరల రాక్షస దూషితములు కావు కదా యని శంకించి దివ్య దృష్టిచే జరిగినదంతయు చూచుచు వింటిని. బృహస్పతి తనయా! నీ ధర్మనిష్ఠ ప్రశంసనీయము. అది సర్వ విద్యార్థులకు ఆదర్శప్రాయమై ఆచంద్రతారార్కము వెలయును గాక

నీతి బాహ్యమయిన దేవయాని ప్రవర్తనకు నీవిచ్చిన శాపము సముచితమే. పుత్రా! ఇంక నీ మార్గములు శుభప్రదములు కాగలవు సుఖముగా దేవలోకమునకు పొమ్ము.

క (వినయ వినమితగాత్రుడై) ఆచార్యదేవా! కృతజ్ఞుడను. మీకివే నా సహస్రాభివందనములు

శ్లో॥ గురుర్బ్రహ్మ గురు ర్విష్ణుః గురు ర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరం బ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః.

శు తథాస్తు (ఆకాశముపైకి చూచుచు) అదిగో దేవ విమానము. నీకై యరుదెంచుచున్నది. త్వరపడుము.

క గురుదేవా! ఇంక సెలవు చెల్లీ! దివికి పోవుచున్నాను ప్రసన్నురాలవు కమ్ము

(కచుడు నిష్క్రమించును)

తెరపడును.



# జానపదుల ప్రణయం

— శ్రీ కె. వి. రమణారావు ఎం. ఏ.

(గత సంచిక తరువాయి)

మరొకపడుచు ఈమెను మొగుడింటి దగ్గరే ఉన్నాడు కాని పగలంతా కష్టపడి పొలంపనిచేసి రావడంవల్ల రావడంతోనే పీకదాకా మెక్కి కుంభకర్ణుడి వారసు డయిపోతాడు. పాప మీమె ఏవేవో ఆశలుపెట్టుకుంది. కాని మొగుడో ఈలోకంలో లే డనే చెప్పాలి. అప్పుడామె ఏమంటుందో చూడండి :

‘ఓరి మొగుడా
ఒయ్యారి మొగుడా
నాయేలిపడ్డ
పాటు చూడు ||ఓరి మొగుడా||
నీవు దయగల
మొగుడవైతే
నేను చిత్రమైన
చీరగట్టి
నేను రత్నమయిన
రయికతొడగి
కాలు కెల్లుకు
కమతలాగున్నాను
మెట్టెలొట్టుకు
బొమ్మలాగున్నాను...’

ఎన్నైనా చెప్పుకోనీ... అతడు
లేస్తాడా ?

మరొక ప్రియు డేమంటున్నాడో చూడండి.

‘చింతావపల్లె సాన చింతా రేకుల్లదాన
చెంతాకూకుంటేను చింతలన్నీపోతాయె
‘సన్నా సన్నానిదాన సన్నాని
కురులదాన
... ... ... ... ... ... ... ...
ఎర్రయ్యెర్రానిదాన ఎత్తూ పిఱ్ఱలదాన...

మొదలైన అంగాంగ వర్ణనలతో ప్రారంభమై ఎలా ముగింపుచేస్తున్నాడో...

‘చక్కానిగుంటా ! సరసనుకూచుంటా
ఏతంటా లేకపోతే నాయెంట రాయె’

అతనితో వచ్చేస్తే నేతి మిఠాయి కొనిపెట్టి, అంతకంటే తీపి కబుర్లు చెబుతూ నిత్రాలు నూపెడతాడట. అదీ ఆమె ఇష్టపడితేనే రమ్మంటున్నాడు. బలవంతం చేస్తే ప్రేమను పొందలే నని ఆజానపద ప్రియుడికి తెలియదా ?

జానపదులు అలంకారాలు, ఆడంబరాలపై మక్కువ చూపెట్టరు వారు కృత్రిమమైన అలంకారాలు కోరరు. స్వాభావికమైన అందానికే ప్రాధాన్యమిస్తారు. సహజసిద్ధమైన అందము గల ప్రేయసి దొరికితే ఆమెను వదలనే వదల నంటున్నా డీ ప్రియుడు .

‘ఓచిన్నదానా విడువనే చెంగు
ఓచిన్నదానా వదలనే కొంగు ||ఓ||
బందారు చిన్నదాన బాజాబందూలదాన
బాజాబందూలమీద మోజేల లేదే ||ఓ||
గుంటూరుచిన్నదాన గుళ్ళపేరులదాన
గుళ్లాపేరులమీద కళ్ళూపోలేదే ||ఓ||
కాకినాడచిన్నదాన కాసులకంటెలదాన
కాసులకంటెలమీద కాంక్షేల లేదే ||ఓ||
నల్లానల్లనిదాన నడుమూసన్ననిదాన
తళుకూ సేపలమల్లె కులుకూ నూపులదానా
నిన్నూనూ సేమనసు నిలుకున్నాదోలె||ఓ||

తనకు బాజాబందులమీదగాని, గుళ్ళపేరులమీద గాని, కాసులకంటెమీద గాని, అవి ధరించిన వాళ్ళమీదగాని, మోజులేదట నల్లదైనా నడుము సన్నగా వుండి తళుకు సేపలమల్లె కులుకు నూపు లుంటే చాలట ఆమె చెంగు వదలడట.

ఒకామెను తన ప్రాణనాథుడుచూచి నవ్వాడట. ఎందుకో తెలుసా... ఆమె నల్లదనిఅట... రంగులో ఏముంది రంజు అంటుందీ సుందరి. అందుకు కొన్ని ఉపపత్తులు చూపిస్తుంది. అయినా అందరిదీ ఒకటే రుచి కాదుగా...

‘నన్ను జూచి నవ్వబోకురో !
ఓ ప్రాణనాథా
నన్నుజూచి నవ్వబోకురో !
నల్లనల్లనిదాన నని నన్నుజూచి నవ్వబోకు
నల్లరేగడ దున్ని చల్లితే
తెల్లజొన్నలు పండలేదా’

నల్లరేగడిభూమిలో తెల్లజొన్నలు బాగుగా పండుతాయి కదా! కాబట్టి రంగుతో పని లేదు. సరసంలో నీకు తక్కువకాను అంటుంది... ఈ పాట విన్న తరువాతకూడ నవ్వుతాడా ప్రాణనాథుడు. అతని గురించి ఎంత చక్కని కమ్మని వంట చేసిందో.

‘బావ బావ సరసయ్యబావ
బాతుగుడ్డూలొండేను బావ
బల్లమీద పెట్టేను బావ
ఊదకూడు వండేను
ఉట్టిమీద పెట్టేను
ఎండుగడ్డి కెల్లకు బావ
ఎండలంట తిరగకు బావ...’

ఊదకూడు, బాతుగుడ్డూలూ వండిందట. ప్రియుడి ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోమంటుంది. చేను తిరుగుళ్ళు తిరగొద్దంటుంది.

తన బావ కష్టపడినందుకు ఒక మరదలు పిల్ల ఎంతగా బాధపడుతుందో చూడండి. పాప మీమె నెవరు ఓదార్చగలరు.

'శుక్రవారం సంతలోన
బావయ్యో! బావయ్యో!
చుట్టుమీద తొక్కినావు
నువు తొక్కినందు కేడలేదు
నీకాలు బాదకేడ్చాను
ఆదివారం సంతలోన
అంటిఅంది గుద్దినావు
నువ్వుగుద్దినందు కేడ్వలేదు
నీకు త్తినొప్పికేడ్చాను
బుధవారం సంతలోన
బుగ్గలట్టుకు కరిసేవు
నువ్వుకరిసినందు కేడలేదు
నీపంటి బాధకేడ్సేను'

ఇచట ఈమె బాధకు కారణాలు . ఎంతైనా జాణకదా!

ఇక ప్రసిద్ధిపొందిన జానపద - జంటలను కొందరిని తెలుసుకుందాము. 'వెంకయ్య-చంద్రమ్మ'లు ఒకజంట. వీరు ప్రేమకరుణల ప్రతిరూపాలు వెంకయ్య హరిజనుడు చంద్రమ్మ కాపుపడుచు సంఘానికి భయపడి వీరి ప్రణయసామ్రాజ్యాన్ని గోదావరి ఒడ్డున స్థాపించుకున్నారు. వెంకయ్య చంద్రమ్మకు అనేక విధాలుగా నచ్చచెప్పి తనతో రావద్దంటాడు

'మాలోణ్ణి పెళ్ళాడ్తె మరియాదపోతాది
మాట్లాడ- కూరకోవే చంద్రమ్మా'
అయినా వెంకయ్యమాటను విన నని
మొండికత్తి

'మంచిమనసైతేను మాలోడిమాటేల
కులమెన్న- కోలేదురో వెంకయ్య
గుణమునే చూశానురో వెంకయ్య.'
మరలా నచ్చచెప్ప ప్రయత్నిస్తున్నాడు
వెంకయ్య

'నిన్ను పెళ్లాడితే నిలువనీయరు నన్ను
కులము తక్కువనీ కొట్టవస్తుండారు'
అబ్బే .! వెంకయ్యలేకుండా బ్రతకలే
నంటుంది

'చాటుచాటున మనముసరసమాడుతుంటే
ఏపోరూ పొక్కుండదే చంద్రమ్మ
ఏపోరు పొక్కుండదే చంద్రమ్మ .'

అంటూ గోదావరి ఒడ్డుకు దాడుకోసారు ఆ ప్రేమికులు వివాహానికైతే కులం గోత్రంగాని ప్రేమకి కాదుగా . !

'ఇద్దరాముకలిసి ఏకముగనుంటేను, ఏడు
లోకాలు మనకాడనే ఉంటాయి.
ఎక్కడికికెళ్ళవద్దే చంద్రమ్మ, ఇక్కడనే
ఉండి- పోదామే చంద్రమ్మ '

అంటూ ఆంధ్రదేశపు నలుమూలల అందరినోట వీరు జీవనం గావిస్తున్నారు

'కొయ్యోడు - చిట్టెమ్మ' మరోజంట వీళ్ళెప్పుడూ చీటికీమాటికీ కొట్టుకొంటూ తిట్టుకొంటూ వుంటారు. ఆక్షణమే తిట్టుకుంటారు. ఆ మరుక్షణమే కలిసిపో- తారు ఇదీ వీళ్ళ వరస

'చీటికిమాటికి చిట్టమ్మంటే
నువ్వు చీపురుదెబ్బలు తింటవురో రయ్యో
కొయ్యోడ!
మాటిమాటికి కొయ్యోడంటే
నువ్వు మడతతాపులు తింటావే లమ్మో
చిట్టమ్మా'

ఎందుకోమరి 'చిట్టమ్మ' 'కొయ్యోడు' అని పిలిపించుకోడానికి జంట యిష్టపడదు కొయ్యోడి కితరస్త్రీలతో సంబంధ ముందికాబోలు చిట్టమ్మ ఏమంటుందో చూడండి

'వాడిపెళ్ళం సూరకత్తంటా
ఎదిగినపిల్లను యింట్లోబెట్టి
చిల్లరమాటలాడకురో రయ్యో
కొయ్యోడ...'

నిజంగా కొయ్యోడికా అలవాటుందో ..' లేక చిట్టమ్మ ఆతని మీద అనుమానపడుతుందో .!! ఎలా దెబ్బలాడుకున్నా చక్కనిజంట వీళ్ళు. దెబ్బలాడుకోవడం ప్రణయంలో ఒక సరదా కదా !!

మరోజంట 'నారాయణమ్మ-నాయుడు బావ' ఎందుకో నాయుడు బావ కీదేశం పడలేదు నారాయణమ్మతో రంగూన్ వెళ్ళిపోదామంటాడు కాని నారాయణమ్మ రంగూన్ వెళ్ళడానికి కిష్టపడదు. ఈజంట తీరిది.

'రంగ వెల్లిపోదామే నారాయణమ్మ
మోటారుబండెక్కి, వాటముగ
దిరుగుదామ
నాటకాలకెల్దాము, బూటకాలివిగాదు
నీయిట్ట మెచ్చినట్టు నే రెప్పుడుంటాను
.. .. . .. . ..

శుక్రవారంనాడు బయలెల్లు ఓడలో పోదాం తయారుగుండు నీకొప్పు నూడనక్కిసోకులెన్నో చూపుతాను.'

శుక్రవారా లలాగే వెళ్ళిపోత న్నాయి కాని నారాయణమ్మ కదల లేదు. ఆంధ్రదేశముపై మక్కువ గల నారాయణమ్మ. పరాయిదేశమంటే ఇష్టపడతాడు నాయుడుబావ. కాని రంగూన్ వెళ్ళలేక పోయాడు నాయుడుబావ అవును మరి నారాయణమ్మను వదిలి తానెలా ఉండగలడు.

చెప్పుకొంటూపోతే జానపదుల శృంగార మెంతైనా వుంది

# శివశంకరులు - కవిప్రియ

- శ్రీమతి కె. వి శ్రీరంగనాయకి, ఎం ఏ

నేటి సాహిత్యప్రపంచంలో శ్రీ శివశంకరులను తెలియనివారు లేరు వారి సాహిత్యాన్ని చవిచూచి ఆనందింపని కవికుమారులూ లేరు. బహుభాషా కోవిదులైన శ్రీశివశంకరులతోడి సంభాషణల వల్ల నూతనవిజ్ఞానదీప్తి ప్రసరించడం చాల మందికి తెల్సినవిషయం

నవ్యకవితామార్గానికి మార్గదర్శకులైన శ్రీశివశంకరులు మధురకావ్యాల నెన్నింటినో నిర్మించి కవితలో నవ్యతను చూపించారు సర్వవిధ సాహితీ సమాహారమైన సాహితీ సమితి వారిసభాపతిత్వంలో సార్థకమై అనితర సాధ్యమైన కృషి చేసింది.

వారు సాహిత్యశాఖ లన్నింటిలో తమ ప్రజ్ఞ ప్రదర్శించినా వారి కవిత్వంలో విలక్షణమైన ప్రత్యేకత ఉంది. కవితా విధానాల నెన్నింటినో వారవలంబించినా వాటి అన్నింటిలో వారి గేయపద్య నాటికలు విశిష్టా లయినాయి. ఆంగ్లాదిభాషలలో పద్యనాటికలే ముఖ్యంగా ప్రాచీనులు వ్రాసినా ఆంధ్రభాషకు శ్రీశివశంకరులే మార్గదర్శకులు అనవచ్చు.

ఆపద్యనాటికల్లోకూడా 'కవిప్రియకు' ముక్కలి గౌరవస్థానం ఉంది. దీని కథావస్తువు ప్రసిద్ధమైన యామినీ బిల్హణుల ప్రేమగాథ అయినా కవులైన శ్రీశివశంకరులు దీనికి 'కవిప్రియ' అని నామకరణం చేయటంవల్ల వారికీనాటికయందుగల విశేష ప్రతిపత్తివ్యక్తమాతోంది. అందును వారికి ముఖ్య మిత్రులు, సాహితీసమితి కార్యదర్శి, కుడిభుజంగా ఉన్న కవిసమ్రాట్ నోరి నరసింహశాస్త్రిగారికి అంకితం ఇవ్వడంవల్ల దీనిపై వారికెంత హృదయాధిక ప్రీతి ఉందో తెలుస్తోంది కవికి దీనియందున్న అభిమానానికి ఇదిసర్వవిధాలా పాత్రభూతమై ఉందని ఘంటాపథంగా నిశ్చయింపవచ్చు. తరచుగా కవులు తండ్రులవలెనే తమ బలహీన గ్రంథాలపై (పుత్రులపై) అభిమానం చూపటం లోకసిద్ధం. కాని శ్రీశివశంకరరులు సర్వధా తరచితరచి చూచికొని గుణదోష విచారణలో హృదయఫలకంపై ఒరపిడిపెట్టి చూచువారు కావున వీరు కేవల కవులే కాక విమర్శకులుకూడా అయిన కారణం వల్ల వీరికవితాఅభిమానం ఎచ్చటా అపాత్రన్యస్తం కాలేదు.

'కవిప్రియ' నామకరణంలో ఒకవిశేషంఉంది యామిని కవిప్రియ ఈకవిప్రియ నాటక కవిప్రియ. శివశంకరుల రచనా విశిష్టత కవిప్రియ కనుకనే ఈ కృతి కీ.శే. నోరి కవిగారికి మరింత ప్రియమైంది.

శివశంకరుల సాహితిని సమాలోచనం చేయగా ఈవిషయాలు సహృదయోల్లాసాన్ని కల్గిస్తాయి

1. కాలగర్భంలో ప్రచ్ఛన్నులైయున్న మహాకవులయు విద్వాంసులయు చరిత్రలను మధురంగా చిత్రించటం.

2. సమయానుకూలంగా సర్వశాస్త్రానుభవాల్ని ప్రస్ఫుటంచేయటం

3. ఆలంకారికులు వర్ణించిన, కావ్యాలకు ప్రాణభూతమైన, ఔచిత్యాన్ని పరిపోషించడం.

4 మహాకవులకు లక్షణంగా చెప్పబడిన ప్రసన్న, మాధుర్య, సౌకుమార్యాలు పద్యరచనలో ఉండటం.

ఇవి బహుభాషా సాహితీ పరామర్శలచే సానలుదేరాయి ఇన్నివిధాలైన సాహితీ ప్రక్రియలు శ్రీశివశంకరుల సాహితీ దర్శనాలనుండి సాక్షాత్కరిస్తున్నాయి. ఇట్టి రచనా దక్షత, ఇంతటి సాహితీ వైవిధ్యం అభూతపూర్వం అనవచ్చు.

ఈ కవిప్రియ పద్యనాటిక. పద్యం గద్యవలె అర్థస్ఫూర్తి కలిగి, రసపరిపుష్టమై వెలయుట శ్రీశివశంకరుల శక్తికి నిదర్శనం.

సంస్కృత భాషలో బిల్హణ చరిత్ర సాహితీపరిచయం కలవారి కెల్లరకు సుపరిచితం. వెనుకటి సాహితీపరులకు బిల్హణ చరిత్రలోని పద్యా లే కొన్నియైనా కంఠస్థాలుగా నుండటం వారి సాహితీ ప్రకర్షకు ప్రతి పాదకంగా భావింపబడేది ఇప్పుడు ఆసంప్రదాయం లుప్తమైందనవచ్చు ఇక కథాపరిచయం.

సంస్కృతభాషలోఉన్న బిల్హణ చరిత్ర అనే కావ్యాన్ని ఎవరు వ్రాసారో తెలియటంలేదు. తత్కర్త బిల్హణుడే అని కొందరంటున్నారు. కానీ నిజానికి బిల్హణుడు రచించినట్లు తోచటంలేదు కథా విధానాన్నిబట్టి కానీ, రచనా సరణిని పట్టి కానీ, ప్రయోగ పారిశుద్ధ్యాన్ని బట్టికానీ బిల్హణచరిత్ర బిల్హణకవికృతంగాతోపదు.

ఆయన వేదం, వ్యాకరణం, మహాభాష్యం, అలంకారశాస్త్రం మొదలగునవి వ్రాసిఉంటాడు

బిల్హణచరిత్రలో "అద్యాపితాం" అను మకుటంగల వసంత తిలకవృత్తంలో ఏబది శ్లోకాలు నిబద్ధాలైనాయి ఈపద్యాలకు 'చౌరీ సురత పంచాశికా' అను పేరు ఉంది. ఇందలి కల్పనలు, భావాలు, శబ్ద ప్రయోగాలు బిల్హణుని అన్యరచనలకు అనుకూలాలుగా కానవచ్చుటచే ఆయన వ్రాసినట్లు భావించవచ్చు "యస్యాః చోరః చికురనికరః" అను ప్రశస్తి గల చోరశబ్ద వాచ్యుడగు కవి సంస్కృత వాఙ్మయంలో ఉన్నాడు ప్రాచీనాంధ్ర ప్రబంధనిర్మాత లందరూ ఇతనిని సుకవి స్తుతిలో చేర్చుకొన్నారు.

సామాన్యంగా చోరుడనే పేరు ఎవ్వరూ పెట్టుకోరు. ఒక్కొక్కప్పుడు లాంఛనంగాగాని బిరుదుగాగాని తదాభాసంగాగాని కొన్ని పేర్లు కవులకు కవయిత్రులకు అంటుకొని ఉన్నాయి ఉదాహరణార్థం. 1 దీపశిఖా కాళిదాసు 2 ఛత్ర భారవి 3. ఘంటామాఘుడు 4 తురంగ బాణుడు. 5 కర్ణికామంఖకుడు 6 వక్షస్థల దీక్షితులు 7 రండానందకవి 8 నిద్రా దరిద్రకవి 9 జఘనచపల 10 వికట నితంబ ఇత్యాది లాంఛననామాలు లగ్నాలైయున్నాయి అట్లే చోరకవి పేరేదియైనా 'చౌరీసురత పంచాశిక' రచించుటచే చోర శబ్ద మాయనకి రూఢమైనట్లుగా తోస్తోంది మొత్తంమీద బిల్హణచరిత్ర అతుకులతుకులుగా కనబడ్తోంది.

తాను రచించిన 'విక్రమాంకదేవ చరిత్ర'లో బిల్హణుడు నిజవృత్తాంతాన్ని నిబద్ధం చేశాడు దానికీ ఇందులో బిల్హణుకు జరిగినట్లు వర్ణింపబడ్డ విషయాలకీ సంబంధంలేదు. కాశ్మీరకుడైన ఈతడు బహురాజస్థానాలలో కొంతకాలం ఉండి గౌరవాలు పొందాడు కుంతల ప్రభువు దగ్గరున్నపుడు ఏదో చిక్కు వచ్చెనని కొంద రైతిహాసికు లంటున్నారు.

"సర్వస్వం గృహవర్తి కుంతలపతిః
గృహ్ణాతు తస్మై పునః
భాండాగార మఖండ మేవ హృదయే
జాగర్తి సారస్వతమ్ ॥
రేక్షుద్రాః త్యజత ప్రమోద మచిరాత్
మస్మందిరం
హేలాందోళిత కర్ణ తాళకరటి
స్కంధాధి రూఢాశ్శ్రియః॥"

ఈపద్యంవల్ల అయన కేదోశ్రమకలిగినట్లు మళ్ళీ తన్నివారణ మైనట్లు ఊహింపవచ్చు. ఇంత మాత్రంచే బిల్హణకవికి బిల్హణచరిత్రలో జరిగిన ఘటన సంభవించిందని చెప్పటానికి వీలులేదు విక్రమాంకదేవ ప్రభువువల్ల ఈకవికి నీలచ్ఛత్రం, గజఘటలో స్థానం ప్రాప్తించినట్లు స్పష్టపడుతోంది.

బిల్హణుడు చాలా చక్కనివాడు పై చెప్పిన పదునెనిమిదవ సర్గలో తాను కాంచనద్యుతికలవాడనీ, తనదేహం సుందరం అనీ వర్ణించుకొన్నాడు సుందరాకారం కలవారు, వాక్ప్రాభవం కలవారు, జనరంజకులనగు కవులకు కామినీ సమాగమం లోకప్రసిద్ధం అట్లే బిల్హణకవి ఉదంతాన్ని ఆనుపూర్వికంగా తెలిసికొన్న ఒకానొక రచయిత ఏతత్కవికి రాజకన్యాసాంగత్యం తుదకు వివాహం కూడా కల్పించాడు.

బహు గ్రంథ పరిశోధనంవల్ల బిల్హణుక కిట్టి ఘటన అసాధారణమని తోచినా కవిప్రియాకారులు అలీకవృత్తాంతాన్నే ఆశ్రయించి ఈనాటికను ఏలరచించారా? అని యోచించాను. ఈశివశంకరులకు స్వతస్సిద్ధంగా ఐతిహాసిక రచనలపై ఆదృతి మెండు. కానీ "లోకంలో విశేష ప్రచారం కలిగి, ప్రాచీన పండితాదరణం సత్యంగా సంఘటింపదగిన సన్నివేశాన్ని కావ్యవస్తువుగా స్వీకరింపవచ్చు" అను సనాతనవిషయాన్ని వీరు అనుసరించారు. సారంగధరచరిత్ర, యుగంధరచరిత్ర, జరుగకపోయినా నాటకాలుగా కవులు రచించారు వస్తువు మనోహరంగా ఉండటంచేత దీని నిట్లే పరిగ్రహించి ఉంటారు ధనంజయుమతంగా ఇది ఉంది.

రమ్యంజుగుప్సిత ముదార మథాపి నీచ
ముగ్రంప్రసాది గహనం వికృతంచ వస్తు।
యద్వా ప్యవస్తు కవి భావుకభావ్యమానం
తన్నాస్తియన్న రసభావ ముపైతి లోకే॥

బిల్హణచరిత్రఅన్న పేరు సరసంగాలేదు వస్తువును బహువిధాలుగా పరిశీలించి నాయిక కవికి ప్రియురాలుగా ఉండదగిన దగుటచేత 'కవిప్రియ' అని నామకరణం చేసినట్లు భావింపవచ్చు.

బిల్హణ చరిత్రలోని పాత్రలకీ ఇందలి పాత్రలకీ నామగ్రహణంలోనూ, ప్రవర్తనంలోనూ, వ్యత్యాసం ఉంది. మదనాభిరాముడనటానికి మదన భూపతి యనీ, పూర్ణతిలకకు యామినీదేవి యనీ చేసిన మార్పు కొంత ఉచితంగా ఉంది. కోటిపాలుడు కొత్వాలువంటివాడు.

బిల్హణ చరిత్రలో రాజు మదనాభిరాముడు ఇది నామవాచకంగా స్ఫురింపదు మదనునివలె అభిరాముడు. ఈ వ్యుత్పత్త్యర్థంలో మదనాభిరాముడైన భూపతి మరియొకడు స్ఫురిస్తాడు. మదన అభిరామ ఈ విశేషణం ఉదాత్తమైన అర్థ విశేషాన్నిస్తోంది కావున అందు విశేషణంచే రాజు చెప్పబడుతున్నాడు. ఇచట మద-భూపతిగా పరిష్కృతుండైనరాజు రాజైనాడు. ఈ పరిష్కారం మూలకర్త సాధించినఅర్థంకంటె స్పష్టమై ఆరాజునే సాధించింది

'యామినీ పూర్ణతిలక' ఈవిధమైన నామకరణం ఏనాడెట్లు వ్యవహారానికి వచ్చిందో భోగ(స్త్రీ) వ్యవహారాన రూఢమైంది సుశీలయు ఆభిజాత్యవతియు నగు నాయిక నామశ్రవణంవల్ల ఈలోక వ్యవహారం స్ఫురింపకుండా ఉంటానికై యామినీదేవి యని పరిష్కారం సముచితంగాఉంది. బిల్హణుని హృదయం కూడా నాయికను యామిని యనియే పిలిచింది.

యామినీ కామినీ కర్ణకుండలం చంద్రమండలం పూర్ణతిలక అనలేక విడువలేదు యామినికి శార్వరియని అర్థద్వయాన్ని సంఘటించాడు అందలి ఒడుపున్నీ తెలుసుకొన్న కవిప్రియాకర్త కూడ యామినిని యామినీదేవియన్నారు. ఈవిధాలైన మార్పులవలన కథక్రొత్త సొగసు సమకూరింది.

సంస్కృత బిల్హణ చరిత్రలో రాజు తన కుమార్తెకు సాహిత్యం కవిత్వం అలవరచటానికి గురువు కావాలి అని సభ్యులతో పల్కగా వారు బిల్హణకవిని సూచించారు ఆ పేరు నేనెన్నడూ వినలేదని రాజుపల్కగా మన నగరంలోనే ఉన్నాడు అరితేరినవాడు అనివారు వివరించారు ప్రత్యక్షంగా పాఠాలు చెప్పేనపుడు మనశ్చాంచల్యం కలుగకుండా ఉండటానికి రాజు ఉపాయం పన్ని యామినికి శ్వేతకుష్ఠువ్యాధి కలదని బిల్హణునికీ, బిల్హణుడు జాత్యంధుడని యామినికీ, చెప్పాడు ఇట్టివారు అన్యోన్య దర్శనాన్ని నిషేధించు వారవటం వల్ల కాండపటానికి (తెర) అవకాశం కలిగింది. కల్పితమైన ఆటంకం ఎంతకాలం నిలుస్తుంది ?

ఒకరేయి కవి చంద్రుని వర్ణిస్తున్నారు. అద్భుతాలైన ఆపద్యాల నాలకించి రాజకుమారి కుతూహలంతో కాండపటం తొలగించి చూచింది పరవశయై మూర్ఛ చెందింది కవికూడ ఆమెనుచూచి పరవశుడైనాడు కొంతకాలానికల్లో ఈ వార్త తెలియగానే మహారాజు కోపోద్దీప్తుడై సభలో అభియోగం తెచ్చి పెద్దలు వద్దన్నా కవికి శూలారోపణశిక్ష విధించాడు. కోటిపాలుడు కవిని వధ్యస్థానానికి తోడనే కొనిపోయినాడు. కవి మరణశిక్ష తప్పించుకొనటానికై యోచనచేసి, ఈపద్యాన్ని ప్రభువుకు పంపాడు.

భట్టి ర్నష్టః భారవీయోఽపి నష్టః
భిక్షు ర్నష్టః భీమసేనోఽపి నష్టః।
భృక్కుండోహం భూపతి స్త్వం హి రాజన్
బద్ధావళ్యాం అంతక స్సన్నివిష్టః ॥

ఇందులో భృక్కుండు డనేది బిల్హణునికి మారుపేరట. రాజీ పద్యాన్ని చదివి, భయగ్రస్తుడైన కవిని క్షమించి ఇంటికి రప్పించి పుత్రిక నిచ్చి పెండ్లి చేశాడు

ఈకథలో కొన్ని చిక్కులున్నాయి. వాటిని సవరింప చేయదలచి నేటి అభిరుచుల కనుకూలంగా శ్రీ శివశంకరులు కొన్నిమార్పులు చేశారు. వీరి యితివృత్తంలో కాండపటం లేదు. ప్రభువులకు వారియువురిపై సంశయమూ లేదు. ప్రథమరంగానికి పూర్వమే యామినికి బిల్హణుని యందు అనురాగం అంతర్గతమై ఉంది. నాయకుడు ధీరుడు. నిబ్బరంతో ప్రవర్తించాడు యామిని నిజానురాగాన్ని వ్యక్తం చేసినపుడు మృదువుగా మందలించాడు వెనుకకు త్రిప్ప ప్రయత్నించాడు కాని అనురాగవాహిని అవధులు దాటి, వెల్లువలైనపుడు రక్తిని రమణీయంగా అందుకొన్నాడు వివాహప్రస్తావన జరగింది చివరకు మదనభూపతికి సక్రమ మార్గాన్నే దుహిత వృత్తాంతం చెవిని బడింది. రాజు సరసుడు యోగ్యుడు అయినను ఆకస్మిక క్రోధావేశాన కవికి శూలారోపణ శిక్ష విధించాడు దుర్గప్రాకారంలోనే నిజసౌధంపై గవంనుండి తాను కన్నులారా చూచుట కేర్పాటుచేశాడు. అంతలో కవి నిర్దోషి అనీ అనురాగభరితుడనీ తన పుత్రికకై ప్రాణాలను కూడా ఆమోద పూర్వకంగా అర్పింపకలడనీ తెలిసికొని రాజు క్షమించి సగౌరవంగా రావించాడు.

తరువాత వివాహం జరగినట్లు సహృదయ సంభావనం.

ఇట్టి మార్పులవలన కథలో రామణీయకత ప్రవృద్ధమైంది. లోకధర్మానికీ మన సత్త్వశాస్త్రానికీ అవిరుద్ధంగా సమస్తం నడిచింది

బిల్హణచరిత్ర ననేకులు నాటకాలుగా రచించారు కాని యీవిధంగా రసోచిత కల్పనలతో నిర్వహించినవారు లేరు. ఈ కవిప్రియ నాటిక మిక్కిలి విశిష్టం. లోకోత్తరం.

ఇక కవిప్రియ నాటికలో ప్రథమరంగాన్ని పరిశీలిద్దాం.

( సశేషం )

# వార్షిక సంచిక

నవంబరు 1 వ తేదీని వెలువడే సమాలోచన సంచిక ప్రత్యేక రచనలతో వార్షిక సంచికగా వెలువడును. రచయితలు సహృదయతతో సహకరింపఁ గోరిక.

వార్షిక సంచిక విడిప్రతి మూల్యము రు. 1-50 ఉండును.

# చదువరులకు

పరిస్థితుల ప్రాబల్యంవల్ల సమాలోచన సంవత్సర చందా రు. 12-00 లకు, విడిసంచిక వెల 50 పైసలకు నవంబరు 1 నుండి హెచ్చింపవలసి యుండును. నవంబరు 1 లోగా చందాదార్లుగా చేరిన వారికి పూర్వపు 10 రు॥ లకే వారి చందా పూర్తి అయ్యేవరకు పంపబడును.

# గమనిక

1 వ సంపుటము వాల్యూములు అయిపోయినవి. రెండవ సంపుటము కొలది ప్రతులు ఉన్నవి నవంబరు 1 తరువాత మూడవ సంపుటము హాఫ్ క్యాలికో బైండుతో సప్లయి చేయబడును. పోస్టేజీతో సహా వాల్యూము వెల రు. 20 లు ఎం. ఒ. చేయవలయును. వి. పి. పద్ధతి లేదు.

— సంపాదకుడు.

అడ్రసు :—
సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,
రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జి. కాలేజి,
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B Sitharama Sastry, Printed at B. V. & Co , Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.